# తేనె సోనలు

## (ద్వితీయ మధుకోశము)

కన్నతేనియ నాని, జుంజుమ్మటంచుఁ,
దేఁటి కన్నియ, సుతి వేయఁ, దియ్యమావి
లేఁ జివుళ్ళను దిని రవళించు పికము
తరుణి కుహూకుహూరావగీతమ్ము భావ
మెఱుఁగు వారలె, నాకృతు లెఱుఁగువారు ॥

గ్రంథకర్త :

విద్వత్కవిభూషణ—

విద్వాన్ వేదము వేంకటకృష్ణ శర్మ

ప్రథమ ముద్రణము—విజయ : వైశాఖము
సర్వస్వామ్యములు గ్రంథకర్తవి,
వెల : ప్రతి 1 కి రూ. 1-4-0.

---

## ఈ గ్రంథకర్త—ఇతర కృతులు

| | | | |
|---|---|---|---|
| దీపమాల (గిరీశ్చంద్రఘోషు నాటకమున కనువాదము మదరాసు—ఆంధ్ర — మైసూరు విశ్వవిద్యాలయ పట్టపరీక్షలకు పాఠ్యగ్రంథము) | ... | రూ. | 2-0-0 |
| సుభాషిత రత్నమాల (పద్య) | ... | ,, | 0-6-0 |
| శ్రీ రామ—లక్ష్మణ స్వభావము (పద్య) | ... | ,, | 0-6-0 |
| ఆంధ్ర పాండవగీతలు (పద్య) | ... | ,, | 0-6-0 |
| భామినీవిలాసము (పండితరాజ జగన్నాథకృతి కనువాదము : శ్లోక సహితము) ... | ... | ,, | 3-0-0 |
| ధర్మ విమర్శనము (గద్యము) | ... | ,, | 1-0-0 |
| భక్తకల్ప శతకము (సీసములు) | ... | ,, | 0-8-0 |
| శిష్యనీతి బోధినీ శతకము (కందములు) | ... | ,, | 0-3-0 |
| భక్తవత్సల శతకము (ఏకప్రాస చంపకములు) | | ,, | 0-5-0 |
| తేనె సోనలు (సాంఘిక, రాజకీయ, భక్తి, శృంగారాదిక చాటు పద్యగేయములు) సంపుటము: 1 ... | | ,, | 1-4-0 |
| తేనె సోనలు (ఖండకావ్యములు) సంపుటము : 2 | | ,, | 1-4-0 |

## అచ్చులోనున్న గ్రంథములు

విష్ణుమహామాయావిలాసము (పద్యములు)
మహేశమాలా (సంస్కృత శ్లోకములు)
పద్మప్రాభృతకము (శూద్రకకవి భాణమున కనువాదము)
నైరాశ్య కావ్యము (పద్యములు)
శతకవాఙ్మయము (మొదటి సంపుటము)
తేనె సోనలు (సంపుటము : 3)

---

ప్రతులకు :
విద్వాన్ వేదము వేంకటకృష్ణ శర్మ,
66. సామిపిళ్ళై వీధి, చూళై, మద్రాసు-7.

# ఆజ్ఞాపాలనము

'కుంద'ను, 'భామిని', నమడల
యందుం 'దొలిసోనలం' బ్రియాత్మజల, న్నా
కిందిర, ధర, నీళలఁబలె
సుందరుల నొసంగి తౌర, సుదతులు గాఁగన్ ॥

మలికామూరిత, 'సోనల', మాన్యతముఁడు,
సూరిజన బిడౌజుండు, నా పేరియతఁడు,
సంస్కృతాంధ్రాంగ్ల వాక్పతి, సజ్జనుండు,
సరసి, మంకాల శ్రీపతిశాస్త్రి కిమ్మ ॥

వేసముగని దాసరినని
యీసున నన్యుఁగఁ దలంప, కిలువేలుప, నా
శాసన మొనరింపుము, తలఁ
బూసరమటు తాల్చి, దానఁ బొసఁగు శుభంబుల్ ॥

మెలఁకువ నొకింత యుండుట కలయుఁ గాదు,
కునికిపడుచుంటిఁ, గాన నిక్కువముఁగాదు,
కనుమొగిచి యనుభవించితిఁ, గల్ల గాదు,
పడకనుంటి, సమాధియొ, భ్రమయొ, మాయొ

శ్రీపతి యానతింగడు దరిద్రదశావశు, సుబ్బరామయా
ఖ్యాపచిత ద్విజాత్మజు, నుదాను, స్వయంకృషిలబ్ధవిద్వాద
ధ్యాపకసత్పదుం, బరహితాచరణు, న్సుగుణాంచితున్
హితున్
శ్రీపతిశాస్త్రిఁ బ్రీతి నొనరింతు నకాముఁడనై కృతీశ్వరున్ ॥

# విషయావళి

—.o.—


| విషయము | | పుట |
|---|---|---|
| 1. సుప్రభాతము | ... ... | 1 |
| 2. శ్రీస్తుతి | ... ... | 7 |
| 3. సౌందర్యలహరి | ... ... | 12 |
| 4. పూవులతోట | ... ... | 20 |
| 5. మేటూరి యానకట్ట | ... ... | 22 |
| 6. ఏకాంతసేవ | ... ... | 27 |
| 7. ప్రియలేఖ | ... ... | 32 |
| 8. కన్యోపాలంభము | ... ... | 37 |
| 9. దుర్యోధనోపాలంభము | ... | 40 |
| 10. పిచ్చిపాదుషా | ... ... | 45 |
| 11. నయనవంచనము | ... ... | 51 |
| 12. బాలాంబ | ... ... | 57 |
| 13. వీరాలాపము | ... ... | 82 |
| 14. హెచ్చరిక | ... ... | 87 |
| 15. కృతజ్ఞత | ... ... | 95 |


(సవరణ :— 80 వ — పుట : 16 వ — [illegible] కనుపడుచున్న :—)
'నిత్తు ముందటే' డని పంపె [illegible].

# పరిచయ వాక్యములు

‘విద్వాన్’ పట్టభద్రులు, ఆంధ్రకవితాగాథకులు, బహుళాంధ్ర గ్రంథకర్తలు, స్నేహపేశలహృదయులు — నైన శ్రీ వేదము వేంకట కృష్ణశర్మగారు, తాము ఎడపదడప రచియించి, ఆయా పత్రికలలోఁ బ్రకటించిన కవితాఖండములను ‘తేనెసోనలు’ — అను పేర గ్రంథరూపమున వెలయించుచున్నారు. ఈ గ్రంథమును శ్రీవారు మూఁడు భాగములుగ విభజించి, ‘మధుకోశము’ — లని పేరొసంగియున్నారు. అందు ఇది రెండవది.

ఇందు పదునాలుగు కావ్యఖండము లున్నవి. వానిలోఁ బ్రసక్తము లయిన వస్తువులఁ బాఠకుల కించుక పరిచయ మొనర్చుట అవసరము గాకపోదు.

ఈ పదునాలుగింటిలో మొదటిది ‘శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము.’ శ్రీ వేంకటేశ్వరస్వామి శ్రీ వేంకటకృష్ణశర్మగారి యిష్టదైవము. శ్రీ శర్మగారు (శ్రీ వేంకటేశ్వర) ‘దేవుని కడప’ — గ్రామసన్నిహితమైన కడప మండలమందు ఉద్యోగధర్మమున పలువత్సరములు గడపినవారు. ‘ఆస్థానకవి’ — ‘కుందమాల’ కును, ‘జగన్నాథపండితరాయల’ — ‘భామినీ విలాసము’ నకును దా మొనర్చిన ఆంధ్రీకరణములను — శ్రీ వేంకటేశ్వర స్వామికి కృతియిచ్చినవారు. అట్టివారు తమ యిలువేల్పగు శ్రీ వేంకటేశ్వర స్వామివారికి సౌఖశాయనికులై, ఈ కావ్యఖండమూలమునగా సుప్రభాతసేవ చేయుచున్నారు. శ్రీ వేంకటేశ్వరస్వామి ‘సుప్రభాతసేవ’ యను రచన మొకటి, పదునాఱవ శతాబ్దపుఁ గవియగు తాళ్ళపాక పెదతిరుమలాచార్య ప్రణీతము — ఈ వఱకే ఆంధ్రసారస్వతమునఁ గలదు. కాని వస్తువిషయమున దానికిని దీనికిని పోలిక అంతగా లేదు. శ్రీ శర్మగారి రచన మనువాదము.

రెండవ ఖండకావ్యము ‘శ్రీస్తుతి’. ‘సుప్రభాతము’ న ముప్పది పద్యములుండగా, ఇం దిరువదిమూఁడున్నవి. ఇదియు ననువాదమే. విషయము విష్ణుపురాణమునందలి ప్రథమాంశములోని తొమ్మిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది. దుర్వాసమహర్షి శాపముచేఁ బదభ్రష్టుఁడైన యింద్రుఁడు, సాగరసంభూతయగు శ్రీదేవిని స్తోత్ర మొనర్చి, యామె వరప్రభావమునఁ

త్రిలోకాధిపత్యము వడసినట్లు — పరాశరులు మైత్రేయునకుఁ జెప్పిన కథా సందర్భములోనిది — ఈ 'శ్రీస్తుతి.' ఇది తొలిమలి సంజలవేళలఁ జదువఁ దగినది. అగస్త్యుఁడు కొల్లాపురి లక్ష్మిని స్తుతించుచు, చెప్పినట్లున్న కాశీఖండములోని :—

ఉ॥ పండితుఁ డాతఁ, డా తఁడు ప్రభావసమగ్రుఁ, డతండు శూరుఁ, డా
తండు వివేకి, యాతఁడు వదాన్యుఁ, డతండు సుశీలుఁ, డా
తండు కళావిదుం, డతఁడు ధన్యుఁ, డతండు మనోజ్ఞమూర్తి, యె
వ్వండు భవత్కృపాకలనవైభవలక్ష్మికిఁ బాత్ర మిందిరా !॥

అనుపద్యమునకు, 'శ్రీస్తుతి' లోని :—

దేవి ! నీకటాక్ష సంభావితుండె
మాన్యుఁడును, గుణవంతుఁడు, ధన్యతముఁడు,
సత్కులప్రసూతుఁడు, బుద్ధిశాలి, మిగుల
శూరుఁ దన్నిఁటమించిన పూరుషుండు ॥

ఆనుపద్యము సాదృశ్యనిబంధన గలది.

'శ్రీస్తుతి' — తరువాతిది 'సౌందర్యలహరి' — ఇది ఇరువదిరెండు పద్యములది. ఇదియు ననువాదము. శ్రీశంకరులవారి ప్రశస్తరచనములలోనిది యొకటి. సంస్కృతసౌందర్యలహరిలో నూరు శ్లోకములున్నవి. శ్రీ దుగ్గా సుబ్రహ్మణ్యశర్మగారు 'సౌందర్యలహరి' — ని పూర్తిగా తెనిఁగించి ప్రచురించియున్నారు. శ్రీసుబ్రహ్మణ్యశర్మగారు గాక, ఆధునికులలో శ్రీమాడభూషి గోపాలాచార్యులను తిరుపతిశాస్త్ర్యు లొకరు వ్రాసియున్నారు; కాని, మూలమున కది అంత సన్నిహితము కాదు. శ్రీ పెమ్మరాజు లక్ష్మీపతిగారు పదిశ్లోకములకు లోపుగ నాంధ్రీకరించి, ఆంధ్రపత్రిక సారస్వతానుబంధమునఁ బ్రచురించిరి. ఈగ్రంథమున శ్రీశర్మగారు ఇరువది రెండు శ్లోకములను మాత్ర మనువదించి యున్నారు. మచ్చున కొకపద్యము:—

చ॥ శరదమృతాంశు కాంతివయి, చంద్రకళారమణీయ చూడవై,
వర, మభయంబు, పుస్తకము స్ఫాటికమాలయుఁ దాల్చి చేతులన్,
బరఁగెడు నిన్ను, సత్కవులు సమ్మతి మ్రొక్కినఁ గాంత్రు గాదె, తా
రారిమను గోస్తనీమధుపయోమధురంబుల దివ్యవాక్కులన్ ॥

శ్రీ వేంకటేశ్వర 'సుప్రభాతము' వినిపించి, అమీఁద 'శ్రీస్తుతి' చేయించి, ఆపైని 'సౌందర్యలహరి' — ని ప్రవహింపఁజేసి, పిమ్మట శ్రీశర్మగారు పాఠకులను 'పూవులతోఁటకుఁ' గొనిపోవుచున్నారు. — ఈ 'మధుకోశము' — లోని స్వతంత్రరచనములలో ఇది మొదటిది. ఇందు శ్రీవారు మనకుఁ బ్రదర్శించినవి :— 'పడినపూవుల విడనివాసన లలరు పూవులతోఁట ;' — 'పూలువాడిన సొగసువీడని మేలిపూవులతోఁట ;' 'భోగులును యోగులును తలలవహించు పూవులుగలతోఁట.' — ఆభాణకము అంతకష్టములేకుండఁగనే అవగతమగుచున్నది.

పూలతోఁటకుఁ బిమ్మట పాఠకప్రేక్షకులకు — కవిగారు 'మేటూరు ఆనకట్ట'ను ప్రత్యక్షమొనర్చుచున్నారు. ఈకావ్యఖండములోని పద్యము లేడింటిలో ఐదుసీసములు. శ్రీవారు వానిని యమకాదిగమకములతో నుచ్చటగ నడిపియున్నారు.

'ఏకాంతసేవ' — యిందలి ఆఱవఖండము. ఇందు రాధాకృష్ణుల ప్రణయమునఁగల అంతరార్థము సులలితవాక్కులతోఁ జెప్ప బడినది. సతి, ప్రాణేశు నర్థించునది సంయోగమేకాని, అన్యము కాదని, ఈఖండకావ్యమున ఏకాంతసేవాచతుర యగు రాధాదేవి ఇట్లు పలుకుచున్నది :—

గీ|| ఐహిక మహాసుఖములొల్ల, నాయువొల్ల,
సద్యశంబొల్ల, రూపాతిశయమునొల్ల,
సర్వసామ్రాజ్యమేనొల్ల, స్వర్గమొల్ల
నేను గోరున దొక్కటే నిర్మలాత్మ ! ||

'ఏకాంతసేవ' కు వెనుకటి ఖండకావ్యము పదునాలుగు పద్యములు గల 'ప్రియలేఖ' యనునది. శకుంతల దుష్యంతునకు వ్రాసిన లేఖార్థము నిందుఁగలవు.

అనంతరము రెండు 'ఉపాలంభ' — కృతులు వెలయుచున్నవి. మొదటిది 'శన్యుపాలంభము.' — ఇది 'శనిగా !' — అను సంబుద్ధితోఁ బ్రారంభమగుచున్నది. 'ఓకీ జడా ! — మందా ! — బడవా ! నీచా ! — తొత్తా ! — కుంటా ! —' మున్నగు సంబుద్ధులు ఇందలి పద్యములలో నిండారి, మెండుకొనియుండి పాఠకులకు ఆమోదము సంపాదింపఁ జాలి యున్నవి.

ఖండకావ్యములలోని యీజాతికే చెందిన ‘దుర్యోధనోపాలంభము’ చెందినది. కురుక్షేత్రసంగ్రామమున నాఁటి ఆంధ్రులు కౌరవపక్షమును వహించి పాండవులతోఁ బోరిరి. పాండవ పక్షపాతియైన వ్యాసుఁడు రచించిన సంస్కృతభారతమును తెనుఁగున ననువదించుచో నన్నయభట్టారకుఁడును పాండవపక్షపాతమునే వహించెను. పైఁగా, తనకృతిపతిని పాండవవంశాంకురముగా వర్ణించెను. నాఁటినుండి ఆంధ్రహృదయము పాండవాభిమానమును సంతరించుకొన్నది. ఇటీవల శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి మున్నగు రచయితలును, ‘కౌరవగౌరవము’ — మొదలగు గ్రంథములును, — కౌరవవాదమునందలి న్యాయమును ఈనాఁటి ఆంధ్రుల జ్ఞప్తికి తెలియింపఁ బ్రయత్నించినవి. ఈఖండకావ్యమున శ్రీశర్మగారును పాండవపక్షపాతులై దుర్యోధను నుపాలంభించిరి. ‘దుర్యోధనసంపద’ — అను నాయకుడికిఁ గావలసినగు రారాజును ‘అల్పుఁడా!’ — అనియు, ‘దురాత్మ’ — అనియు సంబోధించుట సముచితము కాదని కొందఱయిన అనుకొనకపోరు.

ఈపాలంభరచనములకుఁ బిమ్మట మూఁడు చిన్నకథలు ఈ మధుకోశమునఁ జేర్పఁబడినవి. అందు తొలుతటిది ‘పిచ్చిపాదుషా.’

‘పిచ్చిపాదుషా’ చారిత్రకగాథ. ఇట్టివానిని ఖండకావ్యములుగా రచియించిన ఆధునికులలో శ్రీమద్దిపట్ల వేంకటరమణయ్య మేటి. ‘ముక్తితరణము’ — మున్నగు వారి చారిత్రకపద్యగాథలు సుప్రసిద్ధములు. ప్రాయికముగా, వారట్టిరచనములను తేఁటగీతములందే ప్రస్తరించిరి. శ్రీశర్మగారును అట్లే ‘పిచ్చిపాదుషా’ ను గీతములతోనే సాగించిరి. ఈగాథ వీరబలవినోదములలోనిది. కథ చదువఁ జదువఁ జవులూరుచు చమత్కారముగ విలసిల్లుచున్నది.

దీని తరువాతిది నీతికథ ‘నయవంచనము’ — అను శీర్షికగలది. ఇందలి పాత్రలు :— ఈఁగ : సాలీఁడు. — కేయూరబాహుచరిత్ర, భోజరాజీయము, పంచతంత్రము, హితోపదేశము — మున్నగు కావ్యములలోని గాథలను తలపింపఁజేయుచు, నీతిగర్భితమయి సంభాషణరూపమున నడచినది. ‘పిచ్చిపాదుషా’ — ‘నయవంచనము’ లలోని శ్రీశర్మగారి వాక్సులలితశక్తి పేర్కొనఁదగియున్నది. క్రిందితరగతులలోని విద్యార్థులుగూడ ఈగాథలను స్వయముగఁ జదివి, యతిసులభముగ అర్థముచేసికొనఁగలరు.

ఈ గ్రంథములోని ‘బాలాంబ’ — అనుఖండకావ్య మొక బృహత్కథ. శ్రీ రాయసము వేంకటశివుఁడు గారి గద్యానువాదమునకిది పద్యరూపము. ‘గృహలక్ష్మి’ సంచికలలోఁ బ్రకటితము.

తరువాతి కావ్యఖండము ‘వీరాలాప’ మనునది. ఇది పదునొకండు పద్యముల పసందయిన రచనము. ఆంధ్రవీరయువకుఁడగు ‘బాలచంద్రుఁడు’ యుద్ధమున కరుగుచు, — తల్లి ఐతమ్మ అనుజ్ఞాపూర్వకాశీర్వాద మర్థించుట ఇందలి యితివృత్తము. ఆంధ్రదేశమును ‘అమిత్రానుస్సంగ్రహాక్రాంత శత్రుభంగగేహ’ — మనినారు శ్రీశర్మగారు. ఆమాటకీ రచనయే యొక ప్రబల నిదర్శనమనఁదగును.

కట్టకడపటిదియుఁ బదునాల్గవదియు నగు ‘సౌచ్ఛ్వాసక’ లోని విషయము విక్కాలి పరువముగనున్నది. ఆంధ్రభాషాసేవ నేఁటివారి వస్తువ మఁటి పిల్లుటకుఁ గారకులగు కుకవులనుగూర్చి కవిగారు పలుకఁ జెప్పిన పద్యములు హాస్యజనకములుగ నున్నవి. చూడుఁడు :—

సీ॥ ప్రణయసభల, గర్భాధాన తల్పంబు
కడ, నామకరణంబు నడుచుచోట,
రాజకీయోద్యోగి రాకపోకలుసాగు
పట్టున, నరసిక ప్రజలయొద్ద,
మేజువాణీచెంత, రాజపీఠముపొంత,
చట్ట నిర్మాణంపు సభ్యసరస
సంగీత హరికథా సందర్భములయందుఁ
గాఁటిలోఁ బీనుఁగుఁగాష్ఠమునెడ

నెల్లయిక్కల నీవరయి యేడ్తువేల?
పద్దెములతోడ నీపని పాడుగాను ’—

ఇట్టికవులు ధరించు ‘మెడలున్న’ — భిక్షించి తెచ్చికొనియెడు రత్నకాప్రక్షేప’ — లని, ఇట్టికవులు ‘చకచక చెప్పెడు కాకిబికియల్లిక’ — పద్యములు, — ‘తుకడాపద్యము’ లని శ్రీశర్మగారు వివరించినారు. ఈకవుల ‘ఈఁతెగఱ్ఱ’ పదముల — ‘పులుముడు’ పదముల పక్షీని ఒక సీసమున తెక్కించి శ్రీశర్మగారు ఇట్లనుచున్నారు:

ఉ॥ 'పెంపుడుకుక్కల శబ్దరాజియు, వెంపబంక సమాసముల్,
మొండి పదంబులు, మిట్టపల్లపు మోటుదారుల శయ్యలున్,
గుండెఁగాల్చెడు పాకముల్ చవిగూల్చునట్టి రసంబులున్'—
..................................................

“పొట్టఁ బొడిచిన ముక్కలేనట్టివారి
తెల్గు భాషామహాదేవి నేడిపింపఁ
'గవుల' మని లేచి యురుదెంచు కాలమందుఁ
గోపిములు కవు లగుట సిగ్గులకుఁ జేటు!”

ఇట్టి 'పొంచ్చడక' — చదువుటకు ముచ్చటగనుండుటయగాక శ్రీశర్మగారి ఆంధ్రభాషాహితాభిలాషయును సువ్యక్తము చేయుచున్నది.

పదునాలుగు శీర్షికలక్రింద నాస్వాదించువారి కామోదముఁ గూర్చు పద్యపుఁ 'దేనెసోనల' తో భాసించు — ఈమధుకోశమందలి కవిత — 'సర్టిఫికేట్' — 'రిజర్వాయరు' — మున్నగు నవ్యభాషాపదములతో— 'వణిజులకు వేశ్యలకు మద్యపాయులకును మాటనిలుకడ దబ్బఱ'— 'ఎట్టి సాధ్వులకును బుట్టినయింట్లను బెద్దకాలమునికి తద్దతగదు' — వంటి ఆర్యోక్తులతో—'ఉన్నమాటన్న నులుకుదురు'—వంటి సామెతలతో— 'తాతలకు దగ్గు నేర్పుట'— వంటి జాతీయములతోఁ జాలసొంపుగ లేస రాయుచున్నది. ప్రత్యేకముగ 'బాలాంబ' — అట్టి లోకోక్తులకు, దేశ్యములకుఁ బెన్నిధి. రసికజనహృదయరంజనమగు ఈమధుకోశపు పరిచయ వాక్యములకు ముగింపుగా—ముమ్మయ కవిశల్లజుఁడు ముద్దుగ వచించిన —

ఉ॥ “పూర్వకవీంద్రులం గొలుచు పూనిక నిప్పటివారిఁగొల్తు, ని
గ్గర్వతి, నిక్కవీంద్రులు పురాణకవీంద్రులకంటెఁ దక్కువే?
యుర్విని నేఁటి నాఁగుట యొచ్చెమె?— నేఁడును ద్రాక్షపండ్లగోఁ
బూర్వపు ముత్తియంబులను బోలిన మౌక్తికరాజి లేదొకో?” ||

అనుపద్యము పఠింపఁదగును.

మద్రాసు
25-4-'53

ఆంధ్ర శేషగిరిరావు (బి.ఏ.).

## శ్రీ వేంకటేశ్వర

# సుప్రభాతము

కౌసల్యా సుప్రజ! రా
మా! సరవిఁ వేఁగుఁబోక యడరెడు, లెమ్మా!
వేసరక; పురుష శార్దూ
లా! సలుపఁగవలయు, దైవ, మాహ్నికము, ప్రభూ! ॥ ౧

లెమ్మా, గరుడధ్వజ! లెమ్మా, గోవింద!
లెమ్మా, శ్రీశ! భువనాళికి శుభం బిమ్మా! ॥ ౨

సర్వజగదంబ! విష్ణు వక్షస్స్థలమునఁ
ద్రిమ్మరిల్లు మనోహర దివ్యమూర్తి!
శ్రితజనేష్టదశీల! యో సిరులతల్లి!
సుప్రభాతము, వేంకటేశుని నెలంత! ॥ ౩

తెల్లఁదామర కనులొప్పు దేవి! వికసి
తాస్య శశిమండలా! విధీశామరేంద్ర
భామినీ పూజిత! వృషాద్రిపతి వధూటి!
సుప్రభాతము, నీకగుఁ జుమీ, దయాబ్ధి! ॥ ౪

అత్రి మున్నగు సప్త సంయములు, సంధ్య
వార్చి, సొంపారు వినువాక పంకజములఁ
దెచ్చి, నీపాదయుగిఁ గొల్వ వచ్చిరిదిగో!
సుప్రభాతము, శేషశైల ప్రభుండ! ॥ ౫

శర్వ విధిషణ్ముఖేంద్రాది సర్వ సురలు
త్వత్త్రివిక్రమ ముఖ్య కథల్ నుతించి,
రల బృహస్పతి దిన శుద్ధి పలికె నీకు
సుప్రభాతము, వేంకటేశ ప్రభుండ! ॥ ౬

అరవిరియు తమ్మిపూలఁ గొబ్బరియుఁ బోఁక
మున్నగు ద్రుమాల నలరుఁ బూఁబొత్తులఁ గల
కమ్మవాసనతోఁ బిల్లగాలి వీచె
సుప్రభాతము, వేంకటేశ ప్రభుండ! ॥ ౭

లలిత పంజరభాసి లీలాశుకములు
గనుఁగవ న్విప్పి పాత్రలఁ గడమవడిన
పాసె, మరఁటిపండ్లను దిని పలికె లీల
సుప్రభాతము, శేషశైలప్రభుండ! ॥ ౮

వీణాతంత్రుల మ్రోఁత యింపిత మొనర్పఁ
జారురమ్యము మిపుల భాషాసమగ్ర
మజనుతుం డాలపించె నీ యసమచరిత
సుప్రభాతము, శేషశైల ప్రభుండ! ॥ ౯

తుమ్మెదలచాలు పూఁదేనెతోడి రొదల
గీతములు పాడి నినుఁ గొల్వఁ గ్రేవ సరసి
వనరుహోదరములనుండి బయలు వెడలె,
సుప్రభాతము, వేంకటేశప్రభుండ! ॥ ౧౦

తరుణిగణ మాలమందలఁ బెరుఁగుఁ జిలుకఁ
గవ్వముల తీవ్రఘోషలఁ గడవ లసమ
కలహముం బూనెఁ గినుకదిక్కులును దాము
సుప్రభాతము, శేషశైల ప్రభుండ ! ॥ ౧౧

ఇనుని చెలులైన తామరలను వసించు
నళితతులు గల్గ శోభ నిజాంగకాంతి
నణఁప భేరీరవమువోలె ధ్వని యొనర్చె
సుప్రభాతము శేషశైల ప్రభుండ ! ౧౨

శ్రీకర !, యభీష్ట వరద !, త్రిలోకబంధు !,
శ్రీకిఁ డెంకి !, ప్రపంచైక కృపకు సింధు !,
శ్రీ మహాదేవి వసదురః స్ఫీతమూర్తి !,
సుప్రభాతము, వేంకటేశ ప్రభుండ ! ॥ ౧౩

స్వామి పుష్కరిణి మునింగి, సదమలాంగు
లై, శివాజసనందనాద్యయనిరీక్షు
లమరి రిదె, ద్వారమున వేత్రహతశిరులయి,
సుప్రభాతము, వేంకటాద్రి ప్రభుండ ! ॥ ౧౪

శేషగిరి, నారాయణ శిఖరి, వృషభ
ధరము, వేంకటశైలము, గరుడనగము,
వృష కుధర మని నీవాసవేశ్మమంద్రు,
సుప్రభాతము, వేంకటాద్రి ప్రభుండ ! ॥ ౧౫

హరుఁడు, సురపతి, యనలుఁడు, యముఁడు, నిర్ఋతి,
వరుణుఁ, డనిలుఁడు, ధనదుఁడు, శిరములందు
నంజలులు సేర్చి సేవార్థులై నిలిచిరి
సుప్రభాతము, వేంకటేశ ప్రభుండ ! ॥ ౧౬

ద్విజసమితిరాజ, మృగరాజ, భుజగరాజ
దంతిరా, జాశ్వరాజులు, దమతమ యధి
కార మహిమలు దాఁడులఁ గోరి రిదిగో !
సుప్రభాతము, వేంకటేశప్రభుండ ! ॥ ౧౭

సూర్య, శశి, భౌమ, బుధ, గురు, శుక్ర, శౌరి
రాహు, కే, త్వమర పరిషత్ప్రముఖులెల్ల
దాసదాసానుదాసులై త్తఱిని, నీకు
సుప్రభాతము, వేంకటేశ ప్రభుండ ! ॥ ౧౮

త్వత్పదరజంబు శిరమునఁ దాల్చువారు
స్వర్గ మపవర్గ మొల్లని సాధుమతులు,
కల్ప తరువును బొందుటఁ గలఁతఁ గనిరి
సుప్రభాతము వేంకటేశ ప్రభుండ ! ॥ ౧౯

స్వర్గ మపవర్గ పద మంది పరఁగు మర్త్యు,
లరయఁ గోరి భవద్గోపురాగ్రశిఖర
ముల, మనుజలోకమునఁ బుట్ట బుద్ధి నెంత్రు
సుప్రభాతము వేంకటేశ ప్రభుండ ! ॥ ౨౦

శ్రీ ధరానాయక! దయాద్యుచితగుణగణ
రసవనధి! జగదేకశరణ్య మూర్తి!
శ్రీకర! యనంత గరుడాది సేవితపద!
సుప్రభాతము, వేంకటేశ ప్రభుండ!॥ ౨౧

అంబురుహనాభ! పురుషోత్తమా! రమేశ!
వాసుదేవ! వికుంఠ! శ్రీవత్స చిహ్న!
ఆర్తకల్పక! చక్రి! జనార్దన! హరి!
సుప్రభాతము, వేంకటేశ ప్రభుండ!॥ ౨౨

సుమశరుని గర్వమడఁచెడు సొగసుకాఁడ!
చెలుల చనుఁదమ్మిమోసు లీక్షించువాఁడ!
రమ్య విమలగుణాళిఁ బేర్వడయువాఁడ!
సుప్రభాతము వేంకటేశ ప్రభుండ!॥ ౨౩

ఝష, కమఠ, కోల, నరమృగేశ, వటు, పరశు
రామ, రామ, ముసలి, యదుప్రవర, కల్కి-
రూపముల్గొని లోకముల్ ప్రోచు దేవ!,
సుప్రభాతము, వేంకటేశప్రభుండ!॥ ౨౪

పూజ్య మేలాలవంగ కర్పూరగంధి
విలసితము పైఁడిగిండ్ల నింపిన సురనది
జలముఁ గొని, వైష్ణవోత్తముల్ నిలిచి రిదిగొ,
సుప్రభాతము వేంకటేశ ప్రభుండ!॥ ౨౫

భానుఁ డుదయించె, వికసించెఁ బద్మవితతి
విహగ రుతములు దిక్కులఁ బిక్కటిల్లె
సతత మర్థిత శుభులు వైష్ణవులు వసతి
వేఁచిరిదె, వేంకటా! నీకు వేఁకువయ్యె! ॥ ౨౬

నిలువ మున్నగు సురలు, సనందనాది
సాధువులు, యోగివరులు ప్రశస్తవస్తు
హస్తులయి నిల్చిరిదె, నీగృహాంతికమున,
సుప్రభాతము, వేంకటేశప్రభుండ! ॥ ౨౭

శ్రీరమావాస! నిరవద్యహారి సుగుణ
శరధి! సంసారసాగరోత్తరణ ముఖ్య
సేతు! వేదాంతవేద్య! భక్తాతిభోగ్య!
సుప్రభాతము, వేంకటేశ ప్రభుండ! ॥. ౨౮

భక్తి నీవృషాద్రిప సుప్రభాత మెవ్వ
రనుదినము వేఁకువఁ బఠింతు, రట్టివారి
కంగభాజమును, బరార్థ, మతి సులభము,
నైనప్రజ్ఞాధికత స్మృతి యనిశ మొసఁగు ॥ ౨౯

శ్రీవేదము వేంకటకృ
ష్ణావిష్కృత నాముఁడను, బుధారాధకుఁడన్
నీ విమల సుప్రభాతం.
బే విరచించితిని, వేంకటేశ్వర! కొనుమా! ॥ 30

(త్రిలిఙ్గ—ఆగస్టు 26, — 1952)

# శ్రీస్తుతి

ఇంద్రుఁడు :—

అఖిల జగముల తల్లి, క్షీరాబ్ధి తనయ,
వికచ పద్మాయతాక్షి, శ్రీ విష్ణుదేవు
వరవిశాల వక్షస్స్థలావాస, యైన
శ్రీమహాదేవికే నమస్కృతు లొనర్తు ॥

పద్మాలయఁ, బద్మకరన్,
బద్మదళనిభాయతాక్షిఁ, బద్మానన, శ్రీ
పద్మాసన, నిర్జరవర
సద్మ వినుతఁ, బద్మనాభుసతి నేఁదెలతున్ ॥

పావని! సిద్ధియు, స్వధయును
నీవే; స్వాహా, సుధ, సంధ్య నీవే, ప్రభయున్
నీవే, తేఁబవళులు మతి
వీవే, భూతియును శ్రద్ధ ఫీవే చదువున్ ॥

అంబ! మంగళకారిణి! యమరవినుత!
ఘనవిముక్తిఫల ప్రదాయిని! పవిత్ర
యజ్ఞవిద్య, మహా విద్య, యాత్మవిద్య
గుహ్యవిద్యయు నీవ, యగుదువు గాదె! ॥

ప్రాంచి తాన్వీక్షికీ త్రయీ వార్త లీవ
రాజనీతియు నీవ, యీాయోజ, సకల
జగమునందు సౌమ్యాసౌమ్యచతురరూప
ములను నింపి యెసంగు, దెప్పుడును, దేవి! ౫

దేవి! యల గదాధరుఁడగు దేవదేవు
సర్వయజ్ఞమయము, యోగిజనవిచింత్య
మయిన తనువున నీవుగాకన్య లెట్టు
లధివసింత్రందులకు నీవ యర్హవమ్మ ౬

తల్లి! నీవు త్యజింపఁగ
ముల్లోకములు న్వినష్టముం గనఁ, గడలిఁ
జిల్లిల నవతరించి, మ
హోల్లాసము వెలయఁ, జేసి తుద్ధరణమ్ముఁ ॥ ౭

పూజ్యురాల! భవత్కృపా పూర్ణదృష్టిఁ
దవులుమాత్రాన దారాసుతప్రకరము
భవనహితజనధనదాన్య నివహములును
దప్పక లభించు నరులకుఁ దత్క్షణంబ॥ ౮

దేవి! దేహారోగ్య మ
హావిభ వైశ్వర్య శత్రుహర, ణాసమసౌ
ఖ్యావళి త్వత్కరుణా దృ
గ్భావునకుం దుర్లభములు గావు గదమ్మా ॥ ౯

దేవీ! జగముల తల్లి వి
యీ; వీఁక నా దేవదేవుఁడే తండ్రియగుటన్
ఈ విధిఁ జరాచరాత్మక
మై వెలయు ప్రపంచమందు వ్యాప్తులు మీరల్ । ౧౦

సర్వపావని! మాబొక్కసమునుగాని,
మాదు గోష్ఠముఁగాని వేశ్మమునుగాని,
పరిజనముఁగాని, మెయిఁగాని, వధువుఁగాని
వదలకనిశము రక్షింపు, సదయహృదయ ॥ ౧౧

విష్ణువక్షస్స్థలావాస! విడువకుండ,
మాసుతుల, హితులఁ, బసుల, భాసమాన
బహుళభూషణముల నెప్డుఁ బాయకుండఁ
గరుణ రక్షించుచుండుమా! కన్నతల్లి! ॥ ౧౨

అమలా! నీకృపఁ దొరఁగు జ
నములెల్లన్ ఋతము పావనతమ సుశీలం
బమృత స్వభావమాది గు
ణముల విరాజిల్లలేరు నతజనరక్షా! ॥ ౧౩

ఎందులకుఁ బనికి మాలిన
పందయయిన నీ కటాక్షభాగ్యముఁ గనుచోఁ
బొందును శీలాది సుగుణ
బృందధనైశ్వర్యములను బెక్కులు దేవీ! ॥ ౧౪

దేవి! నీదు కటాక్ష సంభావితుండె
మాన్యుఁడును, గుణవంతుఁడు, ధన్యతముఁడు,
సత్కుల ప్రసూతుఁడు, బుద్ధిశాలి, మిత్రుల
శూరుఁ, డన్నిట మించిన పూరుషుండు ॥ ౧౪

ఓ విశ్వపావన చరి
త్రా! విష్ణుప్రియ! యెవండు త్వత్కరుణాదృ
క్సావితుఁడు గాఁడో తత్క్షణ
మే వాని గుణమ్ములెల్ల నెంతయు మాఱుఁ ॥ ౧౬

జనని! వేయేల? నీగుణసమితి నెల్లఁ
గడఁగి నుతియింప నల్వనాల్కయు నశక్త
మనఁగ, ననుబోంట్ల మాటలేల? యనవరతము
మమ్ము విడనాడకయె కృప మనుపవమ్మ! ॥ ౧౭

పరాశరుఁడు :—

అఖిలభూతనివాసిని యైన లక్ష్మి
నుతియొనర్చె మహేంద్రుఁడీ గతిని లెస్స,
నప్పుడామె సురల్ సూడ నదృశ యగుచు
దేవపతి కిట్టు లనియె మైత్రేయ! ప్రీతి ॥ ౧౮

శ్రీదేవి :—

సురపతి! నీదగు స్తోత్రము
పరమానందమ్ము నాకుఁ గలిగించెఁ జుమీ!
వరమీయఁగ వచ్చితి, నెద
పరమరలేకుండఁ గోరుమా ప్రియమెది యేఁ ॥ ౧౯

ఇంద్రుఁడు :—

తల్లి ! నీవు వరంబీయఁ దలఁచితేని
వరముఁ గొాప నముఁ బాత్రుఁడం—చరసితేనిఁ
త్రిభువనముల వసింపవె, ప్రీతిమెఱయ,
నిదియ నాకీవొసంగు గొప్పదగు వరము ॥ ౨౦

అబ్ధి సంభవ! యీస్తోత్ర మమితభక్తి
నెవఁడు పఠియించి మోదాన నెసఁగు, నతని
వదల కెప్పుడు రక్షింపవలయు ననుచు
నడుగఁ దలఁచిన నాదు రెండవ వరంబు ॥ ౨౧

శ్రీదేవి :—

త్రిదశాధిప! నీనుతి స
మ్మోద మందితి, నీ యభీష్టమును దీర్తు నిఁక౯
వదలక ముల్లోకంబుల
సదయత రక్షించుచుందు సత్యము సుమ్మా ! ॥ ౨౨

తొలి మలి సంజల వేళల
నిల నీ స్తోత్రంబు చదివి, యెవ్వఁడు నాక
త్యలఘుతరానందం బిడు,
నల వానిని నీవు గోరినటు లెడఁబాయ౯ ॥ ౨౩

(త్రిలిస్త)



# ఆంధ్ర సౌందర్యలహరి

శివ శక్తిన్ దగఁ జేరి యీ జగములన్ సృష్టించు నాయీశ్వరుం,
డే శక్తిం గనకే చలింపఁ గుశలుం డేమాత్రముం గాఁడతం,
డే శక్తిన్ శివ కేశవాజ ముఖులెంతే భక్తి సేవింతు, రా
యీశానిన్, నిను మ్రొక్కఁ బేర్కొనఁగ నే
నెట్లర్హుండన్, బాపుఁడన్. ౧

అంబా! త్వత్పద పద్మ రేణు వొకయిం తార్జించియే బ్రహ్మ లో
కంబుల్ చక్కఁ సృజించె. వేదలల వీఁకన్ శౌరి దానిన్ వహిం
చెం బాల్పార, హరుండు మర్దన సముస్ఫీతంబుగాఁ జేసి, దా
నిం బూన్కిం భసితోపలేపన విధిన్ సేవించె నుత్కంఠతోన్.

అసయుంబజ్ఞుల కంతరంధతమసోష్ణాంశ్వంతరీపాలయం
బును; జైతన్యగుళుచ్ఛ సన్మధురఝురంబున్, మందులౌ వారికిన్
ఘనచింతామణిపఙ్క్తి దీనులకు, జన్మంబన్ సముద్రాన ము
గ్నిన యవ్వారికి విష్ణుపోత్రి పెనుపల్ నీ పత్పరాగంబగున్. 3

త్వాదితర దేవతా గణ విధంబునఁ బాణియుగంబుచేత, నే
యుదనున నీవుమాత్ర మభయంబు వరంబు నొసంగవంచు, నీ.
పదములె సాధ్వసం బెడపి, వాంఛకుమించి ఫలంబు నీయఁగా,
శంకర! సమర్థముల్ గద! నిరంతర లోకశరణ్యా! మాతరో! ర

నిను నతభక్త భాగ్యజననిన్, హరి నిష్ఠ భజించి, కాంతరూ
పునఁ బురవైరి కీశునకె ముల్ గలిగించె మనోవికారముల్ ;
మునుకొని కాంచి నీ శరణముల్, రతిరమ్య దృగైక దృశ్యపా
తనువున మోహపెట్టును గదా! మదనుండు మునీంద్రజాలముల్.

విల్లా ? పౌష్పము ; తూఁపులా ? యయిదు ; వా
క్ర్వవల్లియా ? తేఁటిచాల్ ;
మొల్లంబౌరథమా ? సుగంధవహముం ;
బాత్రా ? వసంతుండు ; నో
తల్లీ ! యిట్టిఁ డనంగు; డాతఁడు భవత్కారుణ్యమే లేని దో,
ముల్లోకంబుల గెల్వఁగాఁ గలఁడొకో ?
భూభృత్కులాగ్రాత్మజా ! ౬

వరశింజన్మణి మేఖలన్, గలభ కుంభస్ఫీత జృంభత్పయో
ధరనమ్రన్, గృశమధ్యఁ, బార్వణశరద్రాజాస్య, దీవ్యద్ధను
శ్శర పాశాంకుశహస్తపద్మఁ బురజిత్సాటోదహంకారమూ
ర్తి, రహింగొల్తు, మదీయసన్నిధి దయా
దృక్పూరయై నిల్వఁగన్. ౭

అమృతాంభోనిధిఁ గల్ప భూరుహవృతంబౌ రత్నపుం దీవి ను
త్తమ నీపోపవనోజ్జ్వలంబయిన చింతారత్న గేహంబునం
దమలంబైన త్రికోణఖట్వ శివపర్యంకస్థిత, న్నిన్ను, జ్ఞా
నమహానందమయన్ భజించుఁగద ధన్యవ్రాత,
మశ్రాంతముల్, ౮

రస, మూలాధారమందుఁ ; రసమును మణిపూ
రంబునం ; దగ్నియుఁ మేల్
బస: స్వాధిష్ఠానమందుం ; బవనముహృది ; నా
పైన నాకాశముఁ ; మా
నసముం భ్రూమధ్యమందుఁ ; సకలమును సుషు
మ్నాపథంబుఁ——విభేదిం
చి సహస్రారాబ్జమందుం ; జెలువుగఁ బతితోఁ
జేరి క్రీడింతు వంబా ! ౯

జననీ ! త్వత్పదపద్మ మధ్యగళిత
స్ఫాయత్సుధాధార సే
చనముఁ సల్పి, ప్రపంచముఁ మఱి నిజ
స్థానంబు నా చంద్రుచేఁ
గని, స్వాత్మన్ వలయంబునందు భుజగా
కారంబునన్ జొన్పి, పె
ల్చన నిద్రింతువు నీ వుదారకుహరాం
చత్కోలకుండస్థలిన్ ౧౦

జననీ ! నా ల్గైశముల్, పంచకము పరశివ,
స్త్రైః మీశేతరంబున్
ప్రణతార్తిచ్ఛేత్రి ! మూలప్రకృతి నవకమున్
భాస్వదస్రాష్టకంబున్

భానుపారన్ షోడశారంబులుఁ ద్రివలయముల్
మూఁడు రేఖల్ వాసంగ
గసనా నీగేహకోణౌఘము నలువదిపైఁ
గాఁ, జతుస్సంఖ్యతోడన్. ౧౧

హైమవతీ! భవల్లవణి
మాఢ్యతగాంచు నపేక్ష నప్సరో
రామలై, సత్తపఃకృతి, దు
రాపగిరీట్సహయోగ పద్ధతిన్
దామెదఁ జేరుచుండ్రు, రిఁక
ధాతృముఖుల్ కవిరాజు లెంచుకం
తే మది నీ విలాసమున
కీడును గల్పన సేయ నేర్తురే? ౧౨

త్వదపాంగాలోకమం దెవ్వఁడు పడు, నరుఁ, డె
వ్వాఁడు దృగ్గోషుఁ డేనిన్
ముదుకం డేన్, నర్మమూషుండు నయిన, నతనిన్,
మోహామేపార, వేణుల్
స్రీదులన్, బైటల్ దొరంగన్, బెలుచన రశనల్
పీడఁ, బుట్టంబు లూడన్
మదిరాక్షుల్ రత్నముల్ వేమఱు వెనుకొనరే?
మాతరో! వేనవేల్గాన్. ౧౩

నెఱయుఁగ నేఁబదాఱు ధర
ణిస్థలి, నేఁబదిరెండు నీరమం
దఱునది రెండు హవ్యవహు
నందున, నేఁబదినాల్గు గాలి, నే
త్తెఱఁ జదలన్ ద్విసప్తతి, మ
దిన్ మఱి నర్వదినాల్గు, నిట్టులన్
వఱలు మయూఖ సంహతికిఁ
బైనలరుంగద నీ పదాబ్జముల్ ౧౮

శరదమృతాంశు కాంతివయి
చంద్ర కళారమణీయ చూడవై ;
వర, మభయంబు, పుస్తకము
స్ఫాటిక మాలయుఁ దాల్చి చేతులన్
బరఁగెదు నిన్ను, సత్కవులు
పల్కులు ద్రొక్కినఁ గాంత్రుగాదె, తా
హారిమను గోస్తనీ మధుప
యో మధురంబుల దివ్య వాక్కులన్ ౧౯

ఏరు భజించువారలో, క
వీంద్ర హృదబ్జ వినూత నాతప
శ్రీ రమణీయ, నిన్నరుణఁ
జిత్తము రంజిలఁ జేయుచుందు ర

వ్యారలు సజ్జనావళికిఁ
బంకజభూదయితా పయోఽశిశృం
గార రస ప్రవాహయుత
క్రమ గభీరములైన వాక్కులన్. ౧౬

జననీ! వాగ్జనయిత్రులై, శశిమణీ
చంచచ్ఛిలా భంగ తు
ల్య నికామచ్ఛవులై చెలంగెడి నవీ
న్వ్యాఖ్యాదులన్నిన్నుఁ జిం
తనమున్ సల్పునరుండె, కావ్యపతి స
ద్భంగీ రుచుల్ భారతీ
వనితాస్యాబ్జ సుగంధతా మధురతా
వ్యక్తంబులౌ వాక్కులన్ ౧౭

తరుణరవి ప్రభాసరణిఁ
దాల్చిన నీకళ, భక్తిమై నభో
ధరణుల మున్ని యున్నటు లె
దన్ స్మరియించెడు వాఁడెపో, ఎనీ
హరిణ మనోజ్ఞ నేత్రలగు
నచ్చర లూర్వశితోడ నెందఱో
కరమనురక్తిఁ గైవసము
గా, సుఖియించు, సదామహేశ్వరీ! ౧౮

జననీ! శంభునిరాణి! బిందువుగ నా
స్యం బెంచి, యా క్రిందటం
జనుదోయిన్ రచియించి, నిల్పి తదధ
స్థానిన్ ద్రికోణంబు, మా
రస బీజంబు స్మరించువాఁడు గలఁచున్
దథ్యంబు స్త్రైణంబుఁ, జు
ల్కన, సూర్యేందు కుచద్వయిం ద్రిజగతిన్
గావించు విభ్రాంతిలన్ ౧౯

జనని! మయూఖకామృతర
సంబు వరాంగచయంబునుండి, స్రె
ల్చన వెదచల్లు నిన్ శశిశి
లామయ మూర్తియనాఁ దెనెంచు నా
జనుఁ, డహిదర్పముం గరుడు
చాడ్పునఁ జార్చు సదా సుధావలం
బనసిరయైన దృష్టి సుఖ
వంతులఁ జేయు జ్వరప్రదగ్ధులన్. ౨౦

జననీ! సూర్యశశాంక వహ్నిమయిఁ జం
చచ్చంచలాతన్వి, ష
ట్చనజాతోపరిభాగ భాస్వర మహా
పద్మాటవీ సంస్థ, యై

యనువౌ నీకళ నిత్యఘూత మలమా
యంబైన చిత్తంబుతో
ననశింబుం గను యోగు లొందుదురు ని
త్యానంద సందోహముల్. —౨౧

"జననీ! నీప్రియదాసుఁడన్, దయనుగాం
చన్ రాదె?" యన్ భక్తస
ద్వినుతుల్ పూర్ణముగాకమున్నె, కమలా
ధీశేంద్ర సంప్రార్థనీ
యనవోత్కృష్టపదం బిడంగలుగు, దో
రా! నిన్నుఁ బ్రార్థించువా,
రనయం బిందును నందు సౌఖ్యములఁ దా
రందంగ నక్రంబుగో! —౨౨

ముండమూరు (12–4–1951)

——:0:——

౮

# పూవుల తోఁట

అందమైన పసందు గల్గినదిందుఁ బూవుల తోఁటరా!
ఎందుఁగన, మిది డెందమున కానందమిచ్చెడుఁ జూడరా॥ ౧

రంగురంగుల పూలతోడ నెసంగు పూవులతోఁటరా।
అంగుఁగని యేకవులు వర్ణింపంగ సాధ్యముగాదురా॥ ౨

దిక్కులకు వాసనల నిడి పెంపెక్కు పూవులతోఁటరా!
అక్కజంపడి, దీని, కన్యలు ముక్కుపై వ్రేలిడిరిరా!॥ ౩

తుమ్మెదలు గుంపులుగవచ్చి క్రమ్ము పూవులతోఁటరా!
ఝుమ్మటంచును దేనెఁ గొంచును నిమ్ములకు నేఁగెడునురా! ౪

పడిన పూవుల విడనివాసన లడరు పూవులతోఁటరా!
దుడుకులెందఱో గిల్లినను సొంపిడెడు పూవులు గలదిరా! ౫

పూలువాడిన సొగసు వీడని మేలు పూవులతోఁటరా!
తూలు లతలును వ్రాలుకొమ్మలు చాల నిండొప్పారురా! ౬

కాంతిమాయదు కళను బాయదు వింతపూవులతోఁటరా
చింతలుడుపును జనము లెవ్వరు చెంతఁజేరినఁ గనుమురా! ౭

నసుమ నరుగును నందుఁ దొట్టియు నడరు పూవులతోఁటరా
కసుముదంబిడు దివ్యలతయొక టలరు దానను గాంచరా! ౮

వేగ దానిని జేరువారల వెలుఁగుఁ బూవులతోఁటరా!
భోగులును యోగులును దానిపూలఁ దలల వహింత్రురా!॥ ౯

శ్రుతిని గానని తోఁటమాలి వెలయు పూవులతోఁటరా !
అతఁడెచటికిం దానుబోయెనో, వెతకినను గనరాఁడురా! ౧౦

జీవనం బాతండు గూర్పఁగఁ జెలఁగు పూవులతోఁటరా !
ఈవనం బాతండు ప్రోవక యేవిధిని బెంపొందురా ! ॥ ౧౧

ఏమియైనను జూడఁ జూడ నిదేమి పూవులతోఁటరా !
ఏమికాంతి ! ఏమివాసన ! నామనము లోఁగొనెనురా ! ॥ ౧౨

(*ఆంధ్ర పత్రిక'—క్రోధన సంవత్సరాది సంచిక)

———

# మేటూరి యానకట్ట

ప్రాచ్యపాశ్చాత్య శిల్ప కళాప్రవీణ వి
ద్యాకౌశలముఁ జాటునట్టి గీము,
మర్త్యక్షుదోషంబుఁ దొలఁచి, ధాత్రిసుఖంబు
వెనువఁ బర్జన్యుఁ డంపిన గులాము,
రాజ భాండార సరణి పూరణమున కె
ల్లపుడు ధనము పాఱునట్టితూము,
దక్షిణ మండలాంతర కర్షక మృగాళిఁ
బట్టఁ బ్రభుత్వంబు బఱచు దీము,
స్వేచ్ఛమై సంచరించు కవేరకన్య
యనుభవించెడి నూత్న బంధనపు బాము,
ప్రకృతి చిరకాలమునకుఁ గల్పనపు సొంపు
కోరి ధరియించు గోము మేటూరిడాము ॥

శ్రీరాముఁడల కపిసేనచే వార్ధిగ
ట్టించిన సేతువు డీలుపఱచి,
పౌలస్త్యుచే బంతిపగిది నెత్తఁగఁబడ్డ
కైలాసశైలంబు గాకుచేసి,
కుంభజన్మునిశక్తిఁ గ్రుంగి, సామగపడు
వింధ్యాచలమ్మును వీపుజఱచి,
హాలిహాళోద్ధతి గంగయందుఁ గూలిన హాస్తి
పుర దుర్గరాజమ్ముఁ బరిహసించి,

గిరియుగాంతరభూమిఁ సుస్థిరత నిలిచి,
యసమ పావనఁ గావేరి నాఁక వెట్టి
క్షేత్రములకు జలాధారసిద్ధిఁ గూర్చు
సంగులకు మిట్టు, మేటూరి యానకట్ట! ౨

ఒకప్రక్క గాఢలోహకవాట నిచయ సం
యుత పరీవాహము లొప్పులొలుకు,
నొకచక్కి ఘనయంత్ర నికరముల్ శృంఖలా
బంధనరీతిచేఁ బరిఢవిల్లు,
నొకదిక్కు వరసుధా ప్రకట మార్గ శ్రేణి
కలితసేతు వితతి లలినెసంగు,
నొక యిక్కఁ బాషాణ శకల సోపాన పం
క్తులు గనువిందులై కొమరు మిగులు
నొకయెడ నగాగ్రసీమ సమున్నతంపు
సౌధమున కేఁగ వర్తుల సరణి వెలయు,
నహహా! యేశిల్పి పథకమో, యరయరాదు,
ఉల్లమునకిచ్చు ముదము మేటూరి డాము ॥ 3

తను తాపమాఱఁగా మునిఁగినా ముత్తుంగ
విపుల తరంగ కావేరివారిఁ,
గనులకుఁ దనివిగాఁ గనినాము ప్రకృతితో
సయ్యాటలాడు నీ చక్కఁదనము,

వెనుక వింపుగాఁ ద్రావినా మెపనిసఁ
జెంతఁ గోటలలోని చెఱకుఁ బాలు.
వీనుల కింపుగా వినినాము పచ్చిక
బయలఁ బ్రాకుపుఁ గొల్ల పడుచు పదము.
ఇంద్రియములెల్ల మిగుల సంతృప్తిఁ గాంచు
నీదు సన్నిధి వసియింప నిముసమేని
అలరుమా వేయికల్పము లాంగ్ల కీర్తి
మూశలను ముట్ట, మేటూరి మూనకట్ట !॥ ౭

హారతునఁ బెనుచవ్వు ముప్పతిల్లఁగ నౌష్ఠ
లొఱసికొంచరిగెడు దురుసుఁదనము
అడ్డమై నిలుచు వృక్షావళి న్నగములన్
లీలఁ బెకల్చు గయ్యాళితనము,
సరసఁ జేరిన యుల్ల సరిదంబువుల స్వామ్ము
గాఁ జేసికొని యుబ్బు గబ్బితనము,
కుటిల వర్తనఁ డాచి గుమభంగ కరముఁ
బ్రాణేశు నెదఁ జేర్చు జాణతనము,
కొఱఁతవడఁ జేసి, నినుడాసి, కూర్మిఁ బ్రాసి,
మింగులగాసి నిమంద్రోసి, మేల్మిఁ దీసి,
కట్టి, చెఱఁ బెట్టి, రీప్రజ కఱవుఁ జేసి,
విశ్వజన కల్పవల్లి ! కావేరితల్లి ! ॥ ౮

ఆయతబుద్ధి, సర్వకృషి
        కావలి మోదము నొంద, నీరజ
న్యాయము గట్టి శాంగ్లనర
        పాలురు, శిల్పివరుల్. సహాయముల్
జేయఁగ నెన్మిదేండ్లు కతి
        శీఘ్రముగాఁ దగ నేమకోట్లరూ
పాయలు వెచ్చపెట్టి, కను
        వారికి నబ్బుర మావహిల్లఁగన్ ॥ ౬

ఈ మహిత ప్రయత్నమున
        నెందఱు ప్రముందిరో, యెందఱెన్ని బల్
బాముల కగ్గమైరో, తను
        బాధల నెందఱు పొందిరో, యహో!
యీ మహిఁ ద్యాగభూషణులై
        యిట్టి కృతుల్ పొనరించు నేర్పరుల్,
ప్రేమను వారినేకద వ
        రించు యశోరమ శాశ్వతంబుగన్ ॥ ౭

(చంద్రిక—1935 జనవరి)

---

సెంటు పాల్సున్నత పాఠశాలోపాధ్యాయులు విద్యార్థులు 25–9–1934 న మేటూరి యానకట్ట సందర్శింపఁబోయినపుడు—చెప్పినవి.

నిను నిర్మించెను జనముల
కనితర సౌకర్యములను నమరుప, నటఁ, బ
ట్టనముం గట్టించెను, దొర
తన, మది నయనప్రతోషదం బగు నేఁడున్! ౮

విద్యుద్దీప సమేత చత్వరములున్
విస్తార వేశ్మంబులున్
వైద్యస్థానము, లాపణప్రచయము
ల్వార్తావహావాసముల్
సద్వస్సంభృతవస్తుశాలలు, సమ
స్తక్రీడన ప్రాంతముల్
ఖాద్యప్రాంగణరాజి, ధూమశకటా
గారంబులున్ శోభిలున్ ॥ ౯

---

# ఏకాంతసేవ

## శ్రీకృష్ణుఁడు

మంద వెలువడి, నడిరేయి, మందగమన
మందమును గూర్చి, మది భయ మందకుండ,
మందభాషిణి! యిపుడు నామందటి కిటు
మందిలక మీఱివచ్చి తేమందుఁ? జెపుమ! ॥ ౧

## రాధ

కేవలానంద పరవశ భావదివ్య
డోలికల నిర్భరము నూఁగు లీలకంటె,
మోదమిడునది యిటనేది లేదు, కాన
మన సుఖైకాంతసరణికి మంద తగునె? ॥ ౨

శ్రాంతినొంది, ప్రశాంతమౌ సమయమౌట
నర్ధరాత్రంబున సుషుప్తి నందుదు నని
నాకను లప్పి చననౌనె?—నాథ! యిదియు
దొంగలంబట్టు తఱియని తోఁచలేదె? ॥ ౩

అలికిడిని విన్నయంతన, యుందరాని
తాపునకు నుఱికెదవని తలఁచి, యిట్టు
లింద్రియములు చలింపనల్లే యిచటికి
వచ్చితిని నేను బదముపైఁ బదము నిడుచు ॥ ౪

వచ్చునపు డెన్ని శ్రమలకుఁ బాల్పడితినొ,
మెఱిఁగి, నారాక యందమై యెసఁగె నంచు
గేలి సలిపెద, విదియొక లీలయేమొ ?
కాని, యదియు ననుగ్రహంబౌను నాకు ॥ ౫

భావమున నిన్నె యిడుకొని వచ్చుచుంటి
నవశనై, కాన మార్గమధ్యంబునందుఁ
గంటకాశ్మాది బాధలేక గానరావు,
ప్రాణభయమును నామదిఁ బాసిపోయె ॥ ౬

ఇనుమయస్కాంతమట్టు లటులీవు నాదు
మనము నీవంకకే లాగుకొనుచునుండ
నొండు దోఁచునె ? భయమేల యుండు నింక ?
అహహా ! యెంతటి జాణ వీ వాత్మనాథ ! ॥ ౭

అచలయోగుల మనములే యపహరించి
వెంటఁ గొనిపోవ, వారు నీ వెంటఁబడుదు
రింక, నబలను, జంచల హృదయనైన
నన్ను లోఁ గొన, రా, కెట్లు నాథ ! నిలుతు ? ॥ ౮

'మందభాషిణి'—నగుదు, నెట్లందు వేని,
నందియుందని ననుఁబొంద నెందు నెపుడుఁ
దందరం బడుదాన, నే, నందువలన
సుందరాకార ! పలుకుదు మందగతిన ॥ ౯

ఖ వదధీనను, నాకేల పలువిధములఁ
బలు పలుకులాడఁ ? బలువుర పజ్జఁ జేరి,
చెలులతోనైన నెంత నేఁ బలుకవలెనొ,
యంతియేకాని, మెండుగనాడ, నిజము ॥ ౧౧

నాదు సరసంపు సంభాషణంబులెల్ల
విన్న చేరెను నామదిం గొన్ననాఁడ.
త్వత్కృపారుణగల్గ నిపుడవి బయలువడవె ?
యీ వెఱుంగవె ? యాత్మేశ ! యీ విధంబు ॥ ౧౧

ఎరికే నెన్నఁటికినైన నీవ గతివి,
కాన, నానతి నెల్లరుఁ గడకు నీదు
మందటికిఁ జేరవలదె ? యేమతము నేనిఁ
బట్టి, —యిష్టార్థమీవెకా, భక్తతతికి ॥ ౧౨

జల, నగ, రసా, సభా, యజ్ఞసదన, విప్ర
భవన, ఘోరవన, ద్వీప, వరతపోని
వాస, కైరాటముల నెందువర్తిలినను
భక్తసంఘము వెదకి నిను బట్టరాదె ? ॥ ౧౩

మందలను మీఱినానె ?, యీనింద నాకు
నేల కట్టెద వీవు ? యోగీశు లేనిఁ
బ్రకృతి మందల మీఱక, పరమపురుషు
నిన్నుఁ జేరఁగ శక్యమే ? నిర్మలాత్మ ! ॥ ౧౪

శుద్ధ సాత్త్వికమూర్తి నిన్ జూచువేడ్కఁ
త్రిగుణముల మందలన్ మీఱి తెగువమెయిని
మెచ్చి సంసార బంధముల్ ద్రుంచివైచి
పరమ భక్తులు వెఱ్ఱులై తిరుగుచుంద్రు ॥ ౧౫

ఐహికానందములకు జలాంజలి యిడి,
నీచదేహాభిమానంబు నీటఁగలిపి,
యుత్తమపదంబు నందుఁ గాలూఁది నిల్చి,
నిన్నుఁబొందెడు నిష్ఠమె నెగడుయోగి ॥ ౧౬

త్వన్మహోజ్జ్ఞఁ బయోధి మందలను మీఱుఁ,
కులనగంబులుఁగూడ మందలను మీఱుఁ
దలఁప భూతంబులైదు మందలనుమీఱు
నేను మందల మీఱుట లెంత? నాథ ॥ ౧౭

ఎఱిఁగి యెఱిఁగియు 'నేమంద నిచటికేవు
వచ్చి'—తనియెదు ?—నామదిఁ బయటఁబెట్ట
వలెనె? యేనె స్వయంబుగః వాంఛితముల
నడిగి తీర్చిన నానంద మధికమగునొ ? ॥ ౧౮

'అమ్మయైనను దాఁబెట్ట దడుగకుండ'
ననెడు లోకోక్తి నిజముసేయంగఁ దలఁతె ?
"తరుణులమనంబు సర్వపదంబు లెఱుఁగ
బమ్మకున్ను శక్యమే"—యంట, నమ్మినావె ? ॥ ౧౯

నిన్నె పెన్నిధిగా నమ్మి యున్నిశీఘ
నలఁత గోరిచి వెదకుచు నమితకాంక్ష
ననుగుదెంచితి నేకాకి నగుచుఁ గాన
ననుగజంకఁగ నేల ? విన్నాత్మ నాథ ! ॥ ౧౦

ఆత్మ నీకర్పణ మొనర్చినట్టి దినమె,
జంకుఁ గొంకుఁ గళంకుఁ జాంచల్యగుణము
విడె నను, గానఁ గోర్కులవేఁడ నింక
శంకయుండున నామది ? సదయహృదయ ! ॥ ౧౧

ఐహిక మహాసుఖములొల్ల, నాయువొల్ల,
సద్యశంబొల్ల, రూపాతిశయము నొల్ల,
సర్వసామ్రాజ్యమేనొల్ల, స్వర్గమొల్లఁ;
నేను గోరునదొక్కటే నిర్మలాత్మ ! ॥ ౧౨

అంచితామ్నాయ సన్నుతమైనయదియు
నసమసాత్త్విక పావనమైనయదియు
నచలమైనది, చిన్మోదంబైన యదియు,
నెదియొ, యాత్మైక్య మది, నాకు నిమ్ము, దేవ ! ॥ ౧౩

("గృహలక్ష్మి"—1933 ఫిబ్రవరి)

---:o:---

# ప్రియలేఖ

శ్రీయుత ! చంద్రవంశ ఘన
సింధు సుధానిధి ! స్వీయఘోర కా
ర్ముకక మర్దితారి ! పరి
కీర్తిత సర్వదిగంత సద్గుణా !
కాయజ సన్నిభాంగ ! రవి
కాంతి విభాసుర ! హస్తినాపురీ
నాయక ! ప్రాణనాథ ! నిను
నమ్మిన ప్రేయసి, నే,—శకుంతలన్ ॥ ౧

లలిత ప్రేమామృత తలం
దిల మానస నగుచు నిట్లు దీనతతో, నే
విలిఖింపఁగఁ బూనితి, రా
ట్తిలకా ! యీలేఖ, సమ్మతిం గనుఁగొనుమా ॥ ౨

సర్వ సర్వంసహా చక్రభరణ ధురీ
ణ సుభుజా ! ననుఁబ్రోవ విసుగువడితె ?
దీనమానవ రక్షణానూన మానస
పంకజ ! ననుఁబ్రోవ జంకువడితె ?

పరిపంథి పరివృఢ ప్రాభవభంజన
ప్రౌఢ ! నను బ్రోవ భయమువడితె ?
బుధజనకాంక్ష సంపూజ్య పుణ్యాపుణ్య
విజ్ఞ ! నను బ్రోవ బిడియవడితె ?
సత్కృపా పూర్ణదృష్టి ప్రసారితాఖి
లాండజానందదాయక ! యరసి నన్ను
నోమ, నయ్యారె ! నీవిటు లోటువడితె ?
భవదవనదీక్ష యేమయ్యెఁ ? బలుకు, నృపతి ! ॥ ౩

మాలతీలత నాకంఠ మండనముగ
సలిపి, కచభరమున సుమావళులఁ గూర్చి
'యమృతవాహిని నీమోము' టంచుఁ బ్రేమ
ముద్దు గొనునాఁటి మాటలు వోయె నెటులు ? ॥ ౪

'దూతలఁ బుత్తెంచెద' నం
చాతీవను మనము నూఁగు నపుడంటివిగా
దే ? తలఁపవ యద్దానిని
భూతలనాథా ! మదీయ పుణ్యమ యదియున్ ॥ ౫

ఆనాఁటి పల్కులింతయు
మానసమునఁ దలఁపవొక్కొ ? మఱచితొ ? సీరా
జ్యానందానుభవంబునఁ
గానవొ ? యొక్కింత తీరికయొ,—మనుజేంద్రా ! ॥ ౬

మహితకుల మండనుండ వయి,
కోవిద సంస్తుతదివ్యకీర్తివై,
సుధిజన బోధితుండవయి,
క్షోణితలేశ్వర పూజితాంఘ్రివై,
పరమగుణోన్నతుండవయి,
ప్రస్తుతధారుణి చక్రవర్తివై,
హరిహరి ! మాటఁ దప్పితివి;
ఖ్యాతిని గాంచు పథంబెఁయిద్దియున్ ? ॥ ౭

సీ. సువిశాల ఫాలమును,
నీ కమలాయత నేత్రయుగ్మమున్,
నీ సమదంత పంక్తియును,
నీ చిఱునవ్వును, నీ విలాసమున్ ॥
నీ సుకుమార దేహమును,
నీ హొయలుం గని నిశ్చయంబుగన్
మోసము వోతి సుమ్ము !, మన
ముం గనిపెట్టఁగలేక ముగ్ధనై ॥ ౮

సదయావలోకన ప్రదరసంహతి నాదు
హృదయంబుఁ జీల్చుట నెంచలేదె ?
హస్త సంస్పర్శ నాకబ్బ నట్లొనరించి
తహతహఁ గూర్చుటఁ దలఁపలేదె ?

చంద్ర శిలా వేది సరసను గూర్చుండి
యెన్నొ బాసలు సేయుచుంచలేదె ?
ముని మానతిని సైతమును గొనకే నిన్ను
దయితునిగాఁ గొంటఁ దలఁపలేదె ?

కనికరము లేదె ? నాపయి మనసు లేదె ?
ధర్మపద్ధతి మది నింత దలఁపలేదె ?
యేల దూరతలఁ బుత్తేర, వింక నేని
దీనురాలిని నన్ బ్రోవు ప్రాణనాథ ! ॥ ౯

అహారవాంఛను నీయందె యాత్మ నిలిపి,
నిన్నె స్మరియించు, చే, నిట నున్నదాన,
నధిప! కావున నాహార మరుచి యయ్యెఁ
గంటికిని నిద్ర సహితము గఱవెసుమ్మి ! ॥ ౧౦

చారుభూషణ వారమ్మె భారమయ్యె
నతులితాలంకృతులు నసహ్యమ్ములయ్యెఁ
బ్రియ సఖీజన భాషణల్ వెగటులయ్యెఁ
జిక్కి, సగమైతి, వేయేల ? క్షితితలేశ ! ॥ ౧౧

వేగఁ దోఁకొని పోకున్న వెతలఁ బడుచుఁ
గష్ట జీవినిగా నిట్లు గడపు కంటె
నిన్నె యెద నిల్పి ఘనతపోనియతిఁ బూని
యెన్నఁటికి నైనఁ బతిగ నిన్నె వడయుదు ॥ ౧౨

'ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
పెద్దికాలమునికి తద్ద తగదు'—
అనుచు బుద్ధి సెప్పి యందఱు వనుపంగ
వచ్చి, నిన్నుఁ జేరనలయు నేమొ! ॥ ౧౩

అంతకు రాకుండఁగ, ననుఁ
జెంతకు రప్పించుకొనుము, శీఘ్రంబ – మహీ
కాంతా! నిన్నిదె సంప్రా
ర్థింతుఁగా, నామనవిఁ గొనుము ప్రియమెసఁగంగా ॥ ౧౪

('ఆంధ్ర పత్రిక'—అక్షయ సంవత్సరాది సంచిక)

———

# శన్యుపాలంభము

శనిగా! యెంతటి గర్వపూర్ణుఁడవో? వి
జ్ఞానోత్తరుండెవ్వఁడేఁ
ఘనిగాఁ, జూడఁగ లేవు, వానిసతిఁ బ్రో
ద్యచ్ఛీలఁ గాఱింతు, వా
త్మ, నాకింతే ననుకంపఁ గాన, కిసి! ఛే
డా? నీకు సిగ్గింత? ర
మ్మని గారాబముతోడఁ బిల్చినటు లే
లా? వచ్చెదోరి? జడా! ౧

నీవీ లేవు, సరేకదా? —— యిడెదు మా
నిం గాంచి, యేలా? కటా!
భావంబందున నేడ్చె దోరి, పలువా?
బాగాయె నీతోడ, మా
కీ వేనాఁడుర దాఁపురించితివి? యి
ట్లేఁచన్; రవం తేని, నో
రీ వెన్కాంబడ మింతకే, యశుభమూ
ర్తీ! మంద! మందద్యుతీ॥ ౨

కలుషంపుంగృతి నీచపుం గ్రహమవై
కాఱింతు సత్పూరుషా
నళి నెల్లప్పుడు; నింకనుం బరమ పా
పంబు ల్పొనర్పంగ, సి

్గలవే? యేమది? నీ మదిం; జగతి దు
ష్కీర్తిం గనం బాడియో?
పలుసై పోవకు పోవకోరి బడవా!
ప్రఖ్యాతి నార్జించరా! ॥

'షారుగంష్ట్రం గలవాడు వక్రగమనం
బుం గల్గువారా' — యటం
చరయన్ లేని గురుద్వేషాగ్రణివి, సి
చా! నీ చమత్కారముల్
గురు శిష్యప్రవిపాటనంబు నయినన్
గూర్పన్ క్షమంబౌనె? ఛీ!
దార చట్టంబులు చూపవత్తు వటరా!
తొత్తా! ప్రమత్తాధమా! ॥

ఈవే లోకపు సృష్టిబొమ్మ, వింక, నీ
యింటం బ్రవేశించుథా,
రే వాసిం గలవారో చెప్పవలె నా?
యెంతేఁ గురూపుల్లదా,
నీ వేసంబునకున్ గుణాళి విహీతా
నీకంబు దోడయ్యె; వ
స్వో! విన్నంటఁగ విక్కెదింతకే, యఘు
ప్రాగ్భార సంభారకా! ॥

"జనుఁ డెట్టింపుమ నీకు గా' విఁపఁగఁ నీ
చత్వంబుపై మని— —— నోః
మని సాగించెద వోరి! పేరు సెడ, నీ
యంతంబె సాధుల్ మనఁ
బున నేవేళను గోర, నయ్యాది వృషా
పోనేర, దత్యంత పే
క్షనముం జేసి, హరించు నిక్క, నిజము, శుం
తా! కుంతిపుత్రప్రాభవా!॥ ౬

——:o:——

౯

# దుర్యోధనోపాలంభము

పౌత్రుల సొత్తు దాయలకు
భోగ విహారము గాఁగఁ జేసి, వా
రెత్తఱినేఁ బయింబడుదు
రేమొ, యటంచుఁ దలంచి, ఘోర స
త్త్వాత్త మహాటవీస్థలుల
కక్కటా! వారలఁ ద్రోలి, సౌఖ్య సం
పత్తున మత్తునం దిరుగ
భావమునం దిసి! సిగ్గుఁదాల్పవో ॥

అచ్చపు వంశముం దలఁప,
వాదిమ పూరుష వర్తనంబులన్
మెచ్చవు, ఖ్యాతినిం గనవు,
నీతి పథంబును జూడ, వార్యులన్
నిచ్చలుసేయు బోధములు
నీ చెవిఁ జేర్చవు; దుష్టబోధముల్
మచ్చిక విందు, నీ కిఁకను
మానునె రాక విపత్తు లల్పుఁడా! ॥

వంచనఁ గొన్న రాజ్యము ధ్రు
వంబుగ 'నాయదిగా' యటంచు, సి
గ్గించుక లేక తించు సుఖి
యించుటె కాక, దురాత్మ! కానలన్

సాచరణం బొనర్చు ఘన
సత్త్వాలఁ ద్రోసులఁ — బొంకు నాసులకున్
గ్రించుఁదనంబుతోడ నుడి
కింపఁగఁ బూనితి, వెంత జాడ్యమో? ౩

పాతక మార్గమూని, సమ
భాగులఁ బొందు కుమారులఁ, గటా!
పైతృక రాజ్యలక్ష్మి కక్రి
పామతి దూరులఁ జేయఁజూచె, నీ
చేఁతలు సెల్లునే? వినిన
శిష్టులు మెత్తురె? శత్రులేనియున్
రోఁత వహింపరే? యశము
నుం గొని తెచ్చునె? యోకృతఘ్నుఁడా! ౪

ఈసునఁ బాండునందనుల
కెగ్గొనరింపఁగఁ బూనుటెల్ల, వి
శ్వాసము మీఱఁ గత్తిపయి
సాము నొనర్చుటగాదె? దీనిచే,
వాసియు వన్నెయుం గలిగి
వర్ధిల నెంచితివేమొ?, రిత్త లా
లాసలటంచు నెమ్మదిని
నారయవేమొ, కుల ప్రదాహకా!॥ ౫

పాషండ నృపాల సంతతికి
వంచనముఁ బోసరించు దుష్టవై
తాంత్రిక మార్గమూని, విబు
ధప్రవరుల్ వచియించు నీతు, లే
ప్రామాణిక రీతిగా నరసి
ఓగులు సెప్పిన రీతి నీతి యం
చుంచెదవు, వెంత యోగ్యుఁడవో ?
నొప్పమి ముప్పునకే యగుంజుమీ ॥

ఆదిని సంధికై యదుకు
లాగ్రణి యంతటి వాఁడు వచ్చినం,
గాదని త్రోసిపుచ్చితివి
కావరమూని. త్రిలోకపూజ్య పా
దోదితరూక్షవహ్ని నిను
నుక్కడఁగింపక మానునో కో ! సీ
కేదిక దిక్కు ? ప్రాణముల
నేగతిఁ గాఁచి కొనంగ నేర్తువో ॥

అంగ నృపాల జల్పముల
కంతముగల్గదు, సౌబలాక్షితం
త్రాంగము మొక్కవోవదు, ప్రి
యావరజాతికుయుక్తిమార్గముల్

భంగము నొందఁ, వా కుమ న
పత్యము పగ్గియుఁ దగ్గలేదు, నీ
రంగు బయల్పడుఁగా సమర
రంగమునం దటు చక్కసిల్లువా ! ॥ ౮

నిలిచినఁ జాలు, శంకరుఁడె
నీ కయి యుద్ధము సొచ్చెనేనిఁ గా
వల మడఁగించి, త్వత్తనుజ
పౌత్ర సహోదర మంత్రి యుక్తమౌ
బలము రణావనిం జదిపి,
బాహుబలం బెసలార, ధాత్రికిం
బలియిడు నిన్ను, నన్నరుఁడు
భంగుర గాండివ సత్వమేర్పడన్ ॥ ౯

కలి పురుషావతారమవు,
గాఢ మదోత్కట మానసుండవుం,
దులువఁదనాల గేహమవు,
దుర్గుణ సంతతి కాటపట్టువుం,
కుల గత గౌరవాపహార
ఖుండవు, కుత్సిత ధీయుతుండవున్
బలువల మొప్పలం గని, న
భంబును ముట్టెడు పాతకుండవున్ ॥ ౧౦

# పిచ్చి పాదుషా

భారతావని వైభవ ప్రాభవముల
నేలి నుతిఁగన్న మొఘలు నృపాలహార
మందు మణిప్రాస కరణిఁ సత్యంత దీప్తిఁ
బడలఁ బూరించె నక్బరు చక్రవర్తి ॥ ౧

అతని యాస్థానసీమఁ బ్రఖ్యాతిఁ గనియె,
విద్యలకు నల్లా, బుద్ధికి విబుధ గురుఁడు,
కార్య ఖడ్గంబులందు యుగంధరుండు,
బీర బలుఁడను కవికుల విశ్రుతుండు ॥ ౨

స్వాంతగత భావ వివరణ ప్రజ్ఞయందు
సమయ సముచిత వాగ్విలాసంబునందుఁ
ప్రభుహృదామోద కార్య నిర్వాహణమందుఁ
బాదుషా కొల్వులో నంతవాఁడు లేఁడు ॥ ౩

ఒక్కనాఁ డా ప్రభుండు నిండోలగమున
నున్నతఱిఁ బారసీ కోర్వినుండి యల్లఁ
జేరవచ్చిరి బారాహజారి జాతి —
గుఱ్ఱములఁ గొంచు వర్తకుల్ గొందఱటకు । ౪

వారి వృత్తాంతమును మంత్రి వలన నెఱిఁగి,
యశ్వ శాస్త్రజ్ఞులను బంచి హయముల యంగ
లక్షణాదుల, ద్రుతగతి శిక్షణములఁ
జక్కఁగఁ బరీక్ష సేయించి, చక్రవర్తి ॥ ౫

[illegible]సమునుండి యొక లక్ష రొక్కమిచ్చి,
తాను దెచ్చిన పదివేల వారువములు
విలిచి, మఱి పదివేలకు వలయు లక్ష
సంచకరువుగ వారి కొసంగి పంచె ॥ ౬

అంత, మఱునాఁడు గడుఁగుతూహలముతోడ,
వీరబలుఁ గాంచి పురిఁగల వెజ్జివాండ్ర
పేరులను దెల్పు పట్టిఁ దయారుసేయు
మనుచు, హుకు మొనరించె నాయవనవిభుఁడు ॥ ౭

కాని, వీరబలుండు సుల్తాను నాన
నానరుపకె, కాలముం బుచ్చుచుండ, నొక్క
దినము జ్ఞప్తికిఁ దగిలి, పట్టిని గుఱించి
యతని నడిగెను నాతురుఁడై ప్రభుండు! ॥ ౮

అడుగుటయె తడవుగ నతఁ డక్బరు పద
సన్నిధిని బత్ర మొుందుంచె తాస్త్రవిభుండు
దానిఁ గైకొని యిచ్చె నాస్థానమందుఁ
గరణమునకుఁ 'బఠింపు బిగ్గఱగ'—నంచు ॥ ౯

కాగితముఁ గొని చదివె నాకరణ మిట్లు,—
సభ్యులందఱు నాలింప శ్రద్ధతోడ :—
'ఢిల్లిపురిఁ గల పిచ్చివాండ్రెల్లరందుఁ
బ్రప్రథమ గణ్యుఁ 'డక్బరు' ఫాదుషాయె' ॥ ౧౦

అప్పుడు సభలోపలఁ గలకల మతిశయిల్లె:
'ప్రభువులు చనవీయ నీ వీరబలుఁడు తనదు
స్థితి నెఱుంగక యతని నెత్తిపయి కెక్కి
చిందు ద్రొక్కెడు'—నని కొంద ఱనిరి ॥ ౧౧

'పాదుషా యను నొక గడ్డిపఱకకైన
లెక్కసేయఁడు, వీని యీ నిక్కఁబోఁకు
లెల్లకాలము సాగ, దీ హీనమతిని
గొఱతవేయఁగవలె'—నంచుఁ గొందఱనిరి ॥ ౧౨

'అల్పుఁడగు వీరబలు నొక యధికుఁ జేసి,
అతని సలహాల రాజకీయముల పట్లఁ
జేకొను నృపుండు, మనమాటఁ జెవినిబెట్టఁ
డందులకు ఫలమిది'—యని కొందఱనిరి ॥ ౧౩

పట్టికను దన పేరుండు టట్టె తెలిసి
కనుఁగొనల్ జేవురింప, మొఘల్ ప్రభుండు
వీరబలుఁ జూచి, 'యోయి! మా పేరి నిట్లు
ప్రథమమునఁ జేర్చి తిందు;—నీ భావమేమి? ॥ ౧౪

'పరిహసించుటో మముఁ?—, బొరపాటు వడితొ?,
మతిమఱపు సెందితో?, కను మకురుతనమొ?,
పలుకుమా?',—యనఁ, లేచి యంజలి ఘటించి,
వినయమున వీరబలుఁ డిట్లు విన్నవించె:— ౧౫

"దేవా ! హానాము, హేతు వేదియును లేని
కార్యముండునె ?—కాని, నాగ్రహము దేల ?
'ఉన్న మాటన్న నులుకుదు'—రన్న నుడికిఁ
బాత్రులగుదురె ? మీవంటి ప్రాజ్ఞతములు ॥ ౧౬

భరతఖండ మదేడ ? ఆ పారసీక
మేడ ? వర్తకు లరుదెంచు టేడ ? మరల,
వచ్చినను మీకు 'ఘోడా'లఁ దెచ్చుటేడ ?
చేపడిన సొమ్మొసఁగువారు క్షితిని గలరె ?॥ ౧౭

పారసీకము మీ యధికారమునకు
లోఁబడని సీమ, పరుల యేలుబడి గలుగు
స్థలము, వారల నమ్మి తత్తదుల కొఱకు
ముందుగనె సొమ్మునిచ్చు భూపులు గలారె ? ॥ ౧౮

ధర్మజులో, యా హరిశ్చంద్ర ధరణిపతులో
వారు, సెప్పిన విధమున వర్తిలుటకు; —
వణిజులకు, వేశ్యలకు మద్యపాయులకును
మాట నిలుకడ దబ్బఱ మానవేంద్ర ! ॥ ౧౯

ఏమఱిరొ, మఱచిరో, కాక, యెఱిఁగెఱిగిరొ
మీ రొసంగిన లక్షయు మ్రింగి,—కడకు
అన్యదేశీయ వర్తకుల్ హరులఁ దెచ్చి
యీనిచో, వారిఁ జేసెడి దేమి మీరు ? ౨౦

ఇట్టి మీ చిత్రచర్య నన్నచ్చరించెఁ
బట్టికం దొల్త మీ పేరు వ్రాయుపనికి,
దీర్ఘయోచన మొనరించి, దీన దోస
మున్నఁ దగుశిక్ష నాకిం' డటన్న—నృపుఁడు ॥ ౨౧

సుంత యోచించి, తలయూఁచి, సూరివర్యు
వీరబలుఁ గనియనె: 'మాటమేరకెటులో
హయములను దెచ్చి వర్తకు లప్పగించి
రేని, నీమాట బూటకమే గదోయి!' ౨౨

'అపుడు నేఁ బిచ్చివాఁడ నెట్లగుదు? నీవు
పట్టికను వ్రాసినది సత్యమెట్టు లగును?
దబ్బఱల నాడ వీ వింతదనుకఁ, గాన
దీన నీభావ మేమియో? తెలుపు'—మనఁగ ॥ ౨౩

మీరు వల్కిన యట్టులె, వారు తమదు
మాటఁ దక్కించుకొను నీతిమంతులైన
యపుడు, మీ పేరు పట్టికయందుఁ గొట్టి
వైచి, యచ్చోట వ్రాయుదు వారిపేరు ॥ ౨౪

అనఁగ,—'మజ్జారె! పిచ్చివాఁ డంటి, వింత
వఱకు న, న్నిప్పుడెటు పిచ్చివారొ వారు?
చెప్పు'—మన, మంత్రి 'తెక తేరఁ జిక్కె—సొమ్ముఁ
దినుచుఁ గూర్చుండె, కట్టి పాఱెనయ కతన' ॥ ౨౫

అనుచుఁ, బాదుషా మోమున కలఁతి నగవు
యింత సోయగమును గూర్ప, వీరబలుని
బుద్ధిచాతుర్యమునకు నబ్బురము నొంది,
యతని నుతియించి, తగిన సత్కృతులఁ దనుప ॥ ౨౮

సభ్యులును వీరబలుని ప్రజ్ఞాప్రభావ
మప్పుడు పలుతెఱఁగులఁ గొనియాడి రెంతొ,
'రాజనుమతించినదియె ధర్మ'—మని యెంచి
యనుసరించును బ్రజయు దానినె ధరిత్రి ॥ ౨౯

(భారతి)

## ౧౧

# సయుపెంచనము

(ఈఁగ : సాలీఁడు)

సాలీఁడు :—

మక్షికమ! నాదు సద్దాల మహాలు సూడ
నొక్కనాఁడేని రావేమి?—యిటుసు వోవఁ
బ్రొద్దు వృత్తము కొంతసేపు మన మిచట
నూరకయ చుట్టుఁ దిరిగి వేసారనేల? ॥ ౧

'నిగనిగ'ని మించు ముత్యాల నీటు దనర
సన్నవగు వెండి దారాల జాల రెసఁగ
నమరు నాయింటఁ జక్ర చంక్రమణ మలర
హాయి నొక్కింత మెలఁగ రమ్మోయి! సఖుఁడ! ॥ ౨

మండు కొండదినాల 'సిమ్లా' గృహంబు
జడి గురియునాళ్ళ ఢిల్లి రాజ్యాధవరము
గడగడ వడంకు చలితతి గణికగృహము
నిడు సుఖము కెచ్చు నామేడ యిచ్చు సుఖము ॥ ౩

బంగరు మలాము రంగు తుళుంగలించు
నంతిపురిఁ జేర నరిగెడునట్టి త్రోవ,
వర్తులంబైన సోపానపంక్తి వఱలు,
ముచ్చటగ దానిపై నెక్కి పోదమిపుడు ॥ ౪

అతిథి మిత్రుఁడవైన నిన్నాదరింప
నెడఁదఁ గౌతూహలమ్ము రేకెత్తె నాకు
అనుమతింపు మదాహ్వాన మమిత కరుణ
విశ్రమింపుము, వింతలఁ బ్రీతిఁ గనుము ॥ ౫

ఈఁగ :—

వందనము లోయి ! నీదు నాహ్వానమునకు,
వలదు, వల, దేను నతిథిఁ గావలదు నీకు,
సుడి దిరిగియుండు నీయింటి యడుగుమెట్లు
నడుగిడిన జీవి వెండియు వెడలు నొక్కొ ! ౬

సాలీఁడు :—

ఎత్తుగా నెగిరెగిరి నీ వెంతో బడలి
యున్నరీతిని దోఁచె, నోయన్న ! నాదు
శయ్యపైఁ బండి, క్షణము విశ్రాంతిఁ గొనుము,
నమ్ము ! నెమ్మది నా వచనమ్ము, నమ్ము ॥ ౭

అందమైనట్టి తెరలు గేహమ్ము చుట్టు
దింపఁబడి యున్న, వవిగో ! యాదెసను గనుము,
నాలి తెమ్మెరలకు వాని నడుమ నున్న
పట్టుపోఁగుల యుయ్యాల లట్టియూఁగు ॥ ౮

అందు శయనించితేని, నీ యాత్మవీథిఁ
గోర్కులేక నుండ, వెంతో జోకొట్టినట్లు
నిదుర వోదువు, బడలిక నెగడఁ బోదు,
దాన నాచిత్తమును దృప్తి నొనుఁజుమ్ము ! ॥ ౯

పాంథ :—

‘తాతలకు దగ్గు నేర్పఁగఁ దలఁపవలదు,
బడలికలు వాయ, నీసెజ్జఁ బండుకొనిన
బేల, నీ కడుపునఁగదా మేలుకొనును, ?
ఎఱుఁగనే యింతమాత్ర, మోహితుఁడ! చెప్పుమ ॥ ౧౦

గృహేశుఁడు :—

అకట! చెలికాఁడ! నీమీఁది యాదరమ్ము
నెట్లు ప్రకటింతు, విశ్వాసమెట్లు గూర్తుఁ
గాలుమోపుము, నాయింటి కడపపైని
నీవ, యెఱుఁగుదు వంతయు నిశ్చయముగ ॥ ౧౧

అతిథి సత్కార ముచితమౌనట్లు సలుపఁ
బాటుపడి పెక్కుమూల్యపు వస్తువితతిఁ
గూర్చి యుంచితి, నాయాసఁ దీర్చవలదె ?
సంశయింపకు, రమ్మదె! స్వాగతమ్ము! ॥ ౧౨

పాంథ :—

ఏల నీదు నమూల్య వస్త్వాళినాకు ?
దానిఁ గూరిచి పలువురు వలుకవింటిఁ,
బొంగడీకల చేతనే మోసపోదునొక్కొ ?
వలదు నిర్బంధ మింకఁ గృపాకలితహృదయ! ॥ ౧౩

సాహితి :—

మత్క్షిత్రాన్వయదీప! యో మధురరూప!
యుక్తి, శక్తియుఁ గలవు త్వదుక్తులందుఁ
గళుకుఁ దళుకును వెలయు నీ కనులయందుఁ
జక్కనయుఁ జిక్కనయుఁ గ్రాలు జెక్కులందు ॥ ౧౭

పెద్దకూటాన నంతాల పెట్టెలోన
దాఁచి యుంచితి నిలువుటద్దంబొకండు
వచ్చి తేనియు నీరమ్య వదన శోభ
నందుఁ గనుఁగొని తనియుదు, వన్న! నిజము ॥ ౧౮

తారక :—

'నీ సమాదర వచనముల్ నెమ్మిఁగూర్చె,
సెల వొసంగుము నాదు మ్రొక్కులను గొనుము,
వేఱొకదినంబు నినుఁ జూచు వేడ్క వత్తు'
ననుచు నామత్క్షికము పాడుకొనుచుఁ జనియె ॥ ౧౯

సాలెపురు వేమియుం జేయఁజాల కచటఁ
దిరిగి తిరిగి స్వమందిరాంతరముఁ జేరెఁ,
గాని, యెన్నటికైన, నీఁగయె తనంత
వచ్చి, యటఁ జిక్కునని తనయిచ్చఁ దలఁచె ॥ ౨౦

కానఁ, దనయింట నొకమూలఁ గనుల విందు
సేయు మురువైన గూటి రచించి, యందు
మక్షికా భక్షణాపేక్ష మసలఁ దొడఁగె
నేతదాగమనాతి నిరీక్ష దీక్ష ॥ ౧౮

అంత, మఱియొక నాఁ డేఁగ సంతసమ్ము
జాలువాఱఁగ సాలీఁడు సౌధమునకు
వచ్చి, మదికింపు నింపుచుఁ బాడసాగె
దాని విని, యూర్ణనాభము దానిఁజూచి । ౧౯

సాలీఁడు :—

ఎన్ని దినముల కహహా! నీ విటకు మరల
వచ్చితివి? మిత్రమా! నాదు స్వాంతమునకు
కడు ముదంబయ్యె, స్వర్గసుఖములు నీకుఁ
బొందితోఁ గల్గు, నిజము, నా మందిరమున ॥ ౨౦

అహహా! హరి నీలవర్ణంబు నపహసించి,
చిలుక పచ్చని వన్నియ వెలితిచేసి,
రంగు లీనెడు నీమేని యంగు రంగు;
నీదుతల డంబుగల జుత్తు నిక్కియాడు ॥ ౨౧

వజ్రములువోలె నీకనుల్ ప్రజ్వరిల్లు,
నా కనుల్ సీసపుంగుండ్లనంగ నొప్పు
నాకు నీకేటి సాటి యందమున వెండి
ఱెక్క లెసలార రమ్ము నాయిక్క కీవు ॥ ౨౨

అంచుఁ బలికెడు సొలిడు క్రించుఁదనము,
ఎంచనముఁ గాన కేఁగ యీ పలుకులెల్లఁ
సత్యము లటంచు నమ్మి, దుస్తంత్రపువల
యుచ్చులకు మెలమెల్లఁగఁ జొచ్చె, నంత ॥ — ౨౭

సకుని కెదురేఁగుదెంచి యీసాలెపురువు;
తిన్నఁగాఁ బట్టికొని లోని కిన్నయాన
లాగికొనిపోయెఁ బైకి మెట్లబడిదాని,
మరలరాదయ్యె, వెలికి నామక్షికంబు ॥ — ౨౮

జగతి హితశత్రులగువారు సాధుగుణము
పైకిఁజూపుచు, స్వార్థ సాఫల్యసిద్ధి
పొందఁ బరులకు లోలోన ముప్పుఁగూర్పఁ
గడఁగుచుందురు, నైజలక్షణముదోఁప ! ॥ — ౨౯

("మాతృసేవ")

---

# బాలాంబ

వాసి నగరమ్ములకు ఱేడు కొండవీడు,
మిండపగతుఱ కురిత్రాడు కొండవీడు.
చండ శౌర్యమ్మునకు గాడు కొండవీడు
పండి యైశ్వర్యముల వీడు కొండవీడు ! ౧

పెనుగల రెడ్డిరాజుల షికారుకోట,
పోరు మొనగాండ్ర మగఁటిమి కాటవేము.
పలుకుజవరాలి సింగంపుఁ బైఁడిపీఁటఁ
గొండవీటిఁ బ్రతాపుఁడు గూర్మి నేలె ॥ ౨

అతఁడు, చిన వేమరెడ్డి, మహాప్రతాప
విహాసభస్మిత శాత్రవోద్దండబలుఁడు.
వీరుఁడు, ప్రతాపరెడ్డి నా, బిరుదుఁదాల్చి,
కన్నబిడ్డలవలెఁ బ్రజఁ గాచుచుండె ! ౩

తెలివితేఁటలపెట్టె, విద్దియలముల్లె,
పగతుఱకుఁ బ్రక్కబల్లెము, పాడివిడిని.
పలుకళలకద్ద, మీవులకు బరణి,
పేరుపెంపుల కడ్డి శ్రీవేమరెడ్డి ॥ ౪

అతని తొలిభార్య, పుణ్యగుణాంబురాశి,
భర్తృసేవాపరాయణ, పరమసాధ్వి ;
బాల్యమునఁ దలిదండ్రులఁ బాసినట్టి
మేనకోడలిఁ బేరిమిం బెంచుచుండె ॥ ౫

మురిపమున, రెడ్డిదొర, బిడ్డ నరయుచుండెఁ,
గన్నవార్లేని లోటెఱుంగదు నిసుంగు.
సంతులేని కొఱంత వారింత గనరు,
ఇట్లు బాలకు శైశవ మేఁగుచుండె ॥ ౬

అమ్మవలె సాఁకు రాణి - మేనత్త తన్నుఁ
బతిని వెతసంద్రమున నూకి, స్వర్గ మరుగ
మిన్ను విఱిగి తటాలున మీఁదఁ బడియె
జగము గాఢాంధకార విస్తంద్ర మయ్యె ॥ ౭

అంతఁ, జన వేమపతి, సుందరమ్మ యనెడు
వెలఁది వరియించి రాణిఁ గావించికొనియె,
నామె యౌవనమద, యాగ్రహప్రధాన,
అసహనమునకు దుంప, గయ్యాళిగంప ॥ ౮

ఆమె కనుసన్న యానల వేమనృపతి
మెలఁగెనా - సరి ; లేకున్న, మెలఁత కనలు
చిచ్చునకుఁ గ్రాఁగు ; నౌర ! కార్చిచ్చువగిదిఁ
బగఱనేర్చు మగం, డింటఁ బంటు సతికి ॥ ౯

అందములకుప్ప, బాల మేనత్తపేరిఁ
దాల్పఁదగినది ; - గుణరత్నతతియు, యామె
కిడని తొడవులు ; - తేనియ లొడియు నామె
పలుకు, మెత్తని మది నెచ్చెలులకు విందు ॥ ౧౦

కురులతోఁ బ్లాస్యకమలాన గునిసియాడఁ
కాంతిగల పెదవు లెదను బ్రుల్లింతలాడఁ
క్షీర పోన్గుచ్చె లడుగులఁ జిందులాడ
నంతిపురి బాల కన్పండు వగుచుఁ దిరుగు ॥ ౧౧

తేఁటిరెటుటుముల వంకలు దీర్చు కురులు,
మేలి తెలిదామరల సిరి నేలు కనులు,
పసిఁడిచాయల కెగ్గులు వట్టు నొడలు,
క్రాలు బాలాంబ, సుందరి కంటెనలుసు । ౧౨

బాల సోయగ మమలస్వభావము గని
సుందరీదేవి మదిని ననూయపొగలు
నిండుకొనె, నలకన్నియ నెమ్మొగమ్ము
చవితిచందురుఁడయ్యె భూధవునిసతికి ॥ ౧౩

వేడుకగ, మేనకోడలిఁ గూడి, యొక్క-
నాఁడు – అచ్చనగాయల నాడునపుడు,
రాణి, యందలి బాలమ్మప్రజ్ఞఁ గాంచి,
కినుక చెలరేఁగఁ గ్రీడ ముగించి యేఁగె ॥ ౧౪

తనదు మేనత్త చిత్తవృత్తమ్ము, మివుల
దుష్టమని బాల మదికింత దోఁపదయ్యెఁ
గడు నమాయికలకు నాత్మఁ గపటమున్నె ?
'పల్లముననె కదా నిల్చు వాననీరు' ! ౧౫

ఆర్తి యదుపాజ్ఞలకు, లోఁగి యుడుఁగిమడుఁగి
సలుపు నాయమ సెప్పుచేఁతలు ప్రియాన,
బాల, పల్లెత్తుమాటైనఁ బలుకకుండ, –
సహ్యె నది, రాణి యీర్ష్యాగ్ని, కాష్యథాగ ॥ ౧౬

బాల నెటులేని కష్టాల పాలుసేయ,
నామె లావణ్య మడుగంటఁ గష్టొసర్వ,
నీక్షు సహియించె సుందరీదేవి, యకట !
సుమతులకుఁ గీడు నెమకుటె కుమతివృత్తి ॥ ౧౭

సార్వభౌముని రాణివాసమయి, యేమి ?
ఎల్ల యైశ్వర్యములు విలసిల్ల, నేమి ?
ఇంద్రభోగము లఱచేత నెసఁగ, నేమి ?
స్త్రీకి మది మచ్చరంబుంట – చెడుపు చెనుపు ! ౧౮

౨

సుందరీదేవి యొకనాఁటి సందె వేళ
నన్ని విషయాలఁ దనకు సహాయపడుచుఁ
గడుపుకయి యడ్డమగు గడ్డి గఱచునట్టి
మనసుకెక్కిన. యొక చేటిఁ గని వచించె : – ౧౯

'కంటివె బాల' మినుమన్నుఁ గానకుండ,
అచ్చువోసిన యాఁబోతు నటు మదించి,
పట్టపగ్గాలు లేకుండ మిట్టిపడెడు
హృదయశల్యము మాకది యిచట నునికి ॥ ౨౦

దేవియుద్దేశమున కర్హ్మమౌ విధమును,
యోజనము సేయుదాని యట్లుప్పగిమున
వీక్షణములొప్పఁ, దర్జనిఁ బెదవిఁ జేర్చి
కొలఁదితడవుండి, తలయూఁచిఁ, తెలివిదోఁప ౨౬

చిఱునగ వెసంగ, నిట్టూర్చి, చేటి పలుకు
రాణిఁగని : – 'దేవి! మీయభిప్రాయమునకుఁ
దగిన యట్లామె కర్హుఁడౌ దయితుఁ డొక్కఁ
డొప్పు మనరాజుగారి యొడ్డోలగమున ? ॥ ౨౭

'అతఁడు లేకరియైన పోతన్న రెడ్డి
యినుపగజ్జెలతల్లి ప్రేమించుబిడ్డ
పుట్టుదారిద్ర్య మూతని పొత్తుకత్తె
బాలమకుఁ దమ రెంచిన పతిగఁ దగును' ౨౮

అనుచు నుడువఁగ, దేవేరి యమితముదము
నంది, 'యోసి! యిదే నిశ్చయమ్మునుమ్మ!
తిండికిని లేని పోతన్న, దిక్కు లేని
బాలమప్రియుండు ; బళిబళీ! బాగు బాగు' ॥ ౨౯

అధిపునకు, రాణి, తననిశ్చయమ్ముఁ దెలుప,
'నల్లెయగుఁగాత' మనియె ; మోహాంధుఁడాత్మ
సుదతి తేనియ మాటల సొగియుఁ గాని,
లోని విష మింతయేనియుఁ గానలేఁడు ॥ ౩౦

తనువాసంగిన విల్లాలు చనక కెకుఁ—
మురిపమున నె చూపఁ గామరుని పొగడునెకుఁ—
పరిమింగన, భువనకు భీతిదకుఁ—
పది యెఱుంగని దారి ప్రజ నేలఁగలఁడె! ౩౧

౩

బాలమకుఁ బోతరెడ్డి సుపరిచితుండె,
జ్ఞానమసద్గుణములఁ గార్యతంత్రకలన,
శాంత సుందర రూపాన, జవ్వనమున
నాతఁ డామె మనః ప్రణయాధినేత! ౩౨

సౌధమున నొంటిఁ దిరుగుచు తెన్మత లేంద్రుఁ
గొలువుకూటము దిక్కున వెలయు కిటికి
కంతలందుండి బాలాంబ కనుచునుండు
నిందు నొడ్డోలగమున మన్నిని శివి॥ ౩౩

ప్రభుని దాపున రత్నకంబళముమీఁదఁ
దనదు ముందున్న తాళపత్రములఁ గనుచు
మిపుల శ్రద్ధను, గూర్చున్న యువకువంకఁ
దరుణి తిలకించి పులకించుఁ దలఁపులూరి! ౩౪

విసువు నొందక, యలయక, వేసరిలక,
క్రిందఁ బెట్టక చేగంటమును దదేక
దృష్టితో వ్రాయు పోతన దీక్షఁ గాంచి,
ముగ్ధరాలయి సోగియు నవ్వువ్వఁబోఁడి॥ ౩౫

కసుఁబరి శ్రమచే నెఱ్ఱవడిన యతని
వదనబింబము వేసవిఁ బ్రస్ఫుటమగు
క్రొక్కనదమట్లు కాంతులు గ్రుమ్మరింప
కన్నుఁగొనలన్ని రేకుల చెన్నుఁగాంచె ॥

కాదమ తుమ్మెద ఱెక్కల ముదలకించు
లేఁత నూనూఁగు మీసాల లీల దనరె
నతని సామ్రాజ్యపుం బైఁడి పసగువోలె
విస్తృతోరస్క వాటము పెంపుగాంచె ॥

మోమునం గ్రమ్ము చెమ్మట బొట్లు చాలు
రెక్కరాయనిఁ గూడిన చుక్కలట్లు.
భాసిలఁగ తెప్పలార్పక, బాల యతని
మురువు చూడ్కులతోఁ ద్రావి మురిసిపోవు ॥

అంతఁ, గ్రమముగ నామె హృదంతరమున
నతని యెడఁ బావన ప్రణయాంకురమ్ము
మొలకయెత్తఁగఁ బెండ్లాడ వలయు నేని
తనకుఁ దగుపతి యాతఁడే యని తలంచె ॥

కాని, తనకోర్కె యీడేరఁ గలుగు టెట్లు ?
తాఁ బరాధీనయు, స్వాతంత్ర్యతావిహీన,
ప్రాణి యాత్మవశానఁ బడయు సుఖము,
పరవశమున దుఃఖమ్ము లడుగ వలెనె ?

ఎడఁద నిండిన కోర్కె ముందడుగు వేయ,
మునుకొనిన పెనుసిగ్గు తన్ను వెనుకఁదీయ,
బెక్కుశంకలు ధైర్యమ్ము ప్రిదులఁజేయ
దిక్కుదోఁపక మిన్నులఁ జింతిల్లె బాల ॥ ౨౧

తనమనోరథ సాఫల్యమునకు నెవరి
నాశ్రయింపఁగ వలయునో యరయలేక,
యేమి సేయఁగఁదగునొ తా నెఱుఁగ లేక,
దివసములఁ ద్రోయుచుండె నాయువిదమిన్న ॥ ౨౨

ఆవసంతమ్ము గడచె, వర్షాగమంపు
వేళయుం దాఁటె, హేమంత కాల మరిగెఁ,
గాని, మేడపయిం గవాక్షమ్మునుండి
ప్రియునిఁగను బాలచూడ్కి మాఱినది కాదు ॥ ౨౩

మధ్యకాలానఁ జిన వేమ మండలేంద్రు
కొలువునం, గ్రింది నౌకరుల్, గొప్పపదవు
లంది బిరుదులు రాజమాన్యతలు వడసి
పైపయికి నెగఁ బ్రాఁకి లాభములు గనిరి ॥ ౨౪

వంచిన తలెత్తకయ, సదా వ్రాయు, చమిత
సహనమతి, సత్యరతి, సముత్సాహనిరతిఁ
గ్రాలు పోతన, యందని మ్రానిపండ్లె
కన్నుసాచక రాజకార్యముల మెలఁగె ॥ ౨౫

శోకహతుల నెవ రెవరి విజ్ఞాన మెంతో,
ఎవరు నిజమునక్, కల్లరు లెవరో, తెలిసి
భారమునుఁ జొక్కఁ జేయుటేలు? 'నీవు పల్ల
మొఱఁగు నిజ మీశుఁ డెఱుఁగు'నం చెద సహించె॥ ౯౬

సత్యబుద్ధిఁ బ్రదిశుద్ధిగ, సతముఁ దనదు
విధుల నెఱవేర్చు వానికి బిచ్చమిడదు,
బోడితలలకు మోకాళ్ళ ముడులు వెట్టు
కుటిలులకుఁ గల్మిఁ గురియు నీ గ్రుక్షిజగము॥ ౯౭

౮

మేనయత్త దురుద్దేశమే నితాంత
భావుకంబయి బాలకుఁ బరిణమించె,
వెలఁది జొట్టియ నేతిలో విఱిగి పడియె,
విభవమున నామె పోతనఁ బెండ్లియాడె॥ ౯౮

కోరినట్టి వరుండె చేకూరుకతన
బాల లోలోన నెంతయుఁ బ్రమదమందెఁ
గాని యాసత్యమెఱుఁగని రాణి, తనదు
పట్టునెగ్గె నటంచు సంబరముగాంచె॥ ౯౯

వ్యక్తిగత బుద్ధులంబట్టి పలువిధముల
తలఁపు లొకవిషయాననె కలుగుఁ, గాని
గమ్యమందింత భిన్నత గలుగనపుడు
అబ్బురము గూర్చు, నైరాశ్య మతిశయించు॥ ౧౦౦

అవనిపతి మేనకోడలి కరణమిచ్చెఁ
బాలకోటను;— బాలాంబ పంట పండె,
సుందరీదేవి నిర్బంధముం దొలఁగె,
బాల తనప్రియుతోఁ జేరెఁ బాలకోట ॥ ౨౦

ఇట్లు బాలకోట కాచుట్టు పట్టు గ్రామ
ములకుఁ బ్రభుఁడయి యేలుచుఁ బోతిరెడ్డి,
తప్ప కేటేట జేనికిఁ గప్పమిచ్చుచు
వశిఁ దదాజ్ఞలఁ దలఁదాల్చి నడచుచుండె ॥ ౨౧

అన్ని విధముల నాత్మకు హర్ష మొసఁగు
దయితతోఁగూడి దాంపత్య ధర్మసరణి
నడిచెఁ బోతన, వారి ప్రణయము మోద
దాయకంబయ్యెఁ బూవును దావివోలె ॥ ౨౨

పోతనకుఁ దనరాణియు ముఖ్యమంత్రి,
యామె సలహాలఁ గొని రాజ్య మాతఁడేలు.
వారు తమకన్నబిడ్డలపగిదిఁ బ్రజలఁ
గాంచుచుండిరి, కష్టముల్ గలుగకుండ ॥ ౨౩

రాణిసుందరి, వసియించు రాజధాని,
కొండవీడుపురము, పాల కోటకుఁ గడు
దవ్వొ, యయినను, బాలాంబ త్రాఁచుఁ బాము
పడగనీడను, దాఁ గప్పవలె, వసించె ॥ ౨౪

పాలకోట ప్రజల్ ప్రభుభక్తి కలన,
భోగ భాగ్యాయు రారోగ్యమోదవితతిఁ
బడసి, 'నిత్యకల్యాణము పచ్చతోర
ణముగ' నత్యంత సుఖజీవనమ్ముఁ గనిరి ॥ ౬౬

నేర్పుమై రాజ్యపాలన నెఱపు తనదు
నాథునకు బాల 'తలలోని నాల్క'యట్లు
వర్తిలుట విని, యాతన్వి భాగ్యమునకు
మదిని నుప్పొంగెఁ జినవేమ మహిపమౌళి! ॥ ౬౭

పాలకోట ప్రజా ప్రభుభక్తి నతఁడు
తనసతికిఁ దెల్పఁ, బైకి సంతసముఁ గన్న
యట్లు, మోమున విసపునవ్వొలర, నామె
వినియె, లోలోన దుఃఖాగ్ని యినుమడింప ॥ ౬౮

అగ్గిద్రొక్కిన క్రోఁతియో, యావదిన్న
వ్యక్తియో యన నిలుకడవాసి, యకట!
'తా నొకటి మదిఁ దలఁచిన దైవ మొండు
దలఁచెఁ గద' యని రాణి చింతను వహించె ॥ ౬౯

బాలపేరిమి గుండెలో గాలమట్లు
దవిలి, తెవు లింత లేని వేదనను గూర్ప
నెట్టులే, నామె సంసార మేటఁగలుపఁ
బంతమూన సుందరీదేవి పట్టువట్టె ॥ ౭౦

ఉవిద లిపుడు లోకాలోక యుదయవేళఁ
బాలకోటను గల కొండపైని నిలిచి
ప్రాంతసీమలఁ బ్రకృతి సౌభాగ్య మరయు
సొంపారులు మాటలాడుచు నుండిరంత ! ౬౧

అసమలావణ్య రేఖల, దెసలఁ గాంతిఁ
పఱపు నిరువది యేండ్ల తెఱవ యొకతె ;
ముద్దులొలికెడు నాయమ మోమొకింత,
చింతచేఁ, జిన్నవోయిన చెలువు దోఁచె ; ౬౨

తదితరాంగన త్రిదశ వత్సర వయస్క—
యామె దాల్చిన యాభరణాంబరములు
దాలి యువతి కామె దాసిగఁ దెలుపుచుండె
నామె వినుచుండెఁ దనప్రభ్వి యాడునుడులు ! ౬౩

ఆ యిరువురఁ జిన్నది కథానాయిక యగు
బాల ;— పెద్దది చెలియయి వఱలు సీత ;—
మదినిగలఁగి, వివర్ణమౌ వదనమొసఁగఁ
జేటితోఁ, దేవి యిట్లని చెప్పఁ దొడఁగె ॥ ౬౪

భారముల నన్నిటను, రాజ్యభారము కడు
దుర్భరం, బదిపూనుట దుర్ఘటంబు ;
ప్రతిదినము గట్టెల నమ్మిచి బ్రదుకువాఁడు
గ్రామముం జేరి సుంత విశ్రాంతిఁ గాంచు ॥ ౬౫

కుసుమామోదముల వెన్నొత్తె నెంతో బహువుఁ
వాల్చి పయనించు లొట్టియు, దాపుణాంపు
బిడెలు గమ్యస్థలము చేరి పాయఁగలుగుఁ
గాడి విడిచిన యెద్దును గనును శాంతి ॥ ౭౬

రాజ్యభారమొ నానాటఁ బ్రబలి ప్రబలి
దాని వహియించువారి కెంతేని మదికిఁ
గలఁతఁ గూర్చుచుఁ గ్లేశమ్ముఁ గలుగఁజేయు
వేళయందైన హాయి నిద్రింపనీదు ॥ ౭౭

ఓసి, సీతా! చెలీ! యిప్పు డొక్క మేలు
నీవలనఁ గావలయు, గమనించి వినుము,
పాలకోట ప్రజాళికిఁ బ్రళయ మొంపు
గలుగనున్నది, దానిఁ బోకార్పఁదగును ॥ ౭౮

కొలువు కూటమునకు నిన్న కొండవీటి
రాజభటుఁడొక్కఁ డరుదెంచి ప్రభువుఁ గాంచి
యిచ్చె మామేనమామ తాఁ బుచ్చెనంచు
జాబొకం, డది దొరవారు చదువ, వింటి ॥ ౭౯

నిత్య, మేలినవారు మన్నించి మాకు
నెల్లవిషయముల్ పలుకుదు, రీవెఱుఁగవె?
కాని, నిన్నటిలేఖలోఁ గలుగు నాజ్ఞ
యించుకంతయుఁ దెల్పరై రేమొ సీత! ౮౦

సమరముల నిపుణులైన యేఁబండ్రుబంట్లు
వేఁగుసరికంపువాఁడ, నీ పీఁచుసేర
దయయు దాక్షిణ్యమినుమంత దలఁపకుండ
వారిచేఁ బూర్తి సేయింపవలయుఁ బనిని ॥ ౬౬

ఆష్టతుడముట్ట నెఱవేఱు నంతదనుక
రెండవ చెవికి సోఁకనీకుండవలయుఁ
గడకు నీసతికేని సంగాతికేని
నీరహస్యమాడకుము, హుషారుసుమ్మి ॥ ౬౭

దీనినుల్లంఘనము సేయఁబూను నెడలఁ
బాత్రమగుదువు మాక్రోధవహ్నికీవు ;
అంతియేగాక, రాజ్యముఁ బ్రాణవితతిఁ
గోలుపోవుట నిజమనుకొనుము, కనుము ॥ ౬౮

మాప్రభుత్వానఁ గల తక్కుమండలముల
జనులు చెలరేఁగుదురు వీరి సణఁపకున్న,
మొదలనే;- యిదియూహింపు; "మొక్కయప్పుడె
వంచరానిది మ్రానైన వంగునాకొ!" ॥ ౬౯

ఓయి, మిత్రమ! వినుము, సుజనోక్కమాట,
'గోటఁబోయెడు పనిఁదీర్ప గొడ్డలేల ?'
కనుకఁ, గొఱవిని దలగోఁకికొనక, మాకు
వేడ్కసలుపుమ, యిట్టు చినవేమ నృపతి ॥ ౭౦

స్వామియాజ్ఞను, ఈరీతి వల్లభుండు
చదువుచో గూఢముగ బాల యది గ్రహించి
యమితచింతాకులిత హృదయమున, 'నకట !
కంచెయే చేను మేయునా ?' యంచు వగచె ॥ ౫౧

౬

'ఆ ప్రభుం, డిట్టి కఠినతరాజ్ఞ, నేల
యిచ్చె'–నని మది శంకింతు వేమొ, సీత !
సుందరీదేవి మాపై నసూయ గలది
కానఁ దనపగ సాధింపఁదలచె, నిట్లు ॥ ౫౨

మాప్రభుత్వాన సుఖముమై మనెడు ప్రజల
స్థితిగతులు విన్న, సుందరీదేవి శ్రవణ
కుహరముల కవి ముల్కులై యహరహమ్ము
హింసఁ గలిగింప మాప్రజ నేఁచఁదలఁచె ॥ ౫౩

'పోటుకుదప్పెఁగదా'–యని మురియుచుండఁ
బిడుగుపాటుగ రాజాజ్ఞ వడియె నెత్తి,
'నీడదొరకెఁగదా' యని తాడిక్రింది
కరుగఁ దానిఫలము వడి యగిలె శిరము ॥ ౫౪

'ఎచటికేఁగిన నాపద లేల తప్పు
భాగ్యహీనుల'–కని బుధుల్వల్కు పలుకు
వితయగునె ? కానిచోఁ, గొండవీడ దేడ ?
పాలకోట యిదేడ ? యీపాటులేడ ? ౫౫

పాడిదప్పని యేలినవారు ప్రభుని
మానఁ దలఁదాల్చుటే ధర్మమైన – మాకు
శాశ్వతాపయశము దీన సంభవించు
నరకమునుగల్గుఁ, దలయెత్తి తిరుగనగునె ? ॥ ౮౭

ఒనరుపఁగ రా, దొనర్పక యుండ రాదు,
కనుక, నిది 'ముందు గోయియు, వెనుక నూయి'
యన్నస్థితి యయ్యె – నీ సమయంబునందుఁ
దోఁచె నామది నొక్కయాలోచనంబు ॥ ౮౮

లేఖలో విషయమ్ము తెలిస ప్రభువులు
చెప్పకయ, నాకుఁ దెలియుట చేతఁ, బాల
కోట వాసుల నెల్లర ఘోరవధకుఁ
దప్పి, మనఁజూచు టెంతయుఁ దగవుగాదె ॥ ౮౯

ఇదిగో ! నాయంగుళీయక, మిది గ్రహించి
కొండ దిగిపొమ్ము, మాపాలకోటపురికి,
నచటఁ జదుకములన్నిల్చి, యందఱకును
వినెడుగతి బిగ్గఱగ నిట్టులనుము, సీత ! ॥ ౯౦

"రాణి బాలాంబ యీనగరమ్ము వదలి
పోయి, మిము యోజనముదూరమున నొకింత
కాలము వసింపఁగోరె, మీమేలు నెంచి,
కాన, బ్రాణాల నాసింతు రేని చనుఁడు ॥ ౯౧

ఇచట మీాయింట్ల ధనధాన్యనిచయమెల్లఁ
గడు సురక్షితముగ నుండుఁ గాన, రాక్షి
ప్రాన నోఁదలఁదాల్చి వేగాన మీార
లరగడియలోనఁ బురినుండి యరుగవలయు" ॥ ౯౦

అంచు బిగ్గఱగాఁ జాటి యంగుళీయ
కమ్ము నానవాలుగఁ జూపు, కష్టమనక,
ప్రజలఁగావంగ, ధర్మసంరక్షసేయ
నెల్లు తగునట్లు లొనరింపు, మిపుడ చనుము । ౯౧

బాలమూరాణి తనచేటిఁ బంపి యిట్లు
కోటలోనికిఁజనెఁగాని, గుండెబరువు
తొలఁగదయ్యొ ; నెడంద యుయ్యాలవిధమున
నూఁగఁదొడఁగె, విచారముల్ రేఁగి కలఁచె ॥ ౯౨

౭

బాలసూర్యుని లేయెండ మేలితళుకు
సకలదిశలకు జేగుఱుచాయఁ బూయఁ
బ్రాణులరగంట, ఱెక్కచప్పట్లఁ బులుఁగు
లలఁతినగవునఁ బ్రసవము లరయఁదొడఁగె ॥ ౯౩

లోకబాంధవ మృదుకరాస్తోకసుఖులు
తీవ్రకిరణోష్ణహస్తాల దిగులుగనరె ?
పోతరెడ్డి యేల్బడి నెమ్మిఁ బొదలు పౌరు
లల ప్రతాపుని పీడల నడలురీతి ॥ ౯౪

కటకట భానూదయమగు
సరి, నావేమావనీశు సైనికవీరుల్
కరవాలశూల ముఖపరి
కరములతోఁ జాలకోటఁ గదువడిఁ జేరన్ ॥ ౯౬

ముందునకుఁగూడ నొకఁడేని మానవుండు
గానరాకున్న వారల కక్కజమునంది,
మాయురే! యిదియేమి యన్యాయ? మిచట
నొక్కపిట్టయు మెలఁగ, దీటక్క దేమొ? ౯౭

పతి మనల నిట్లు శోధింపఁ బన్నెనేమొ?
పోతరెడ్డి యొనర్చిన మోసమేమొ?
ప్రజలె యీఁగుట్టు మును బసివట్టిరేమొ?
అడవియో? యూరొ? యేమిగారడిమొ యేమొ? ౯౮

అనుచు సాయుధపాణు లాయుధిపుబంట్లు
వాడలును, దోఁటలును, దొడ్లు, మేడ, లిండ్లు,
సందుగొందులు, వీధులుఁ జదుకములును
వేయికన్నుల నెల్లెడ వెదకిచూడ ॥ ౯౯

ఒక్క తెలివున, నొకపజ్జ, నొక్క మగువ
యగపడియె వారి, కాయమయండ కరిగి,
తెలిపి రామెకు రాజాజ్ఞ తీరు వారు,
కాని మఱుమాట పల్కదా కాంత సుంత ॥ ౧౦౦

బెదరించియు, నదలించియు
ముదలించియు నుత్తరమ్ము వొందఁగలే, కా
మదమత్తులైన సైనికు
లదయత నాపడఁతి యుత్తమాంగముఁ ద్రుంపన్ ౧౦౧

ఎగిరిపడియెఁ దల దవ్వున
నెగి కూలెను మొండెమును బృథివిపయి, నీచులన్
మగఁటిమిఁ జూపిన జోదు, ల
రిగిరి వడిం, గొండవీటి జేనింగనఁగన్ ॥ ౧౦౨

రాణియూనతిఁ దలఁదాల్చి ప్రజలనెల్లఁ
బట్టణమునుండి యనిపి, తత్ప్రాణసమితిఁ
గాచు పూనిక మెయి శత్రుగణము, దన్నుఁ
జుట్టుముట్టిన నులుక బాషూరరాలు ॥ ౧౦౩

"దేవి కాపద యేమైనఁ దెచ్చువేమొ
గుట్టుబయలైన" - నని, వారు గ్రుచ్చిగ్రుచ్చి
యడుగఁ, గలఁగక, జంకక, యళుకుగనక,
యధర మేనిఁ గదల్ప దాయతివమిన్న ॥ ౧౦౪

తనదు ప్రాణాపదయు నింత దలఁపకుండ
రాణి శాసనమును స్వధర్మమ్ముఁదీర్చి
శాశ్వతయశశ్శరీరము సంతరించె
సీత, యామెకు సాటులౌ చేటులెవరు ॥ ౧౦౫

౮

పాలకోట నాకానాక పడఁతి తప్పు
నెనరులేకుంట, నరవధ కెడములేక
పోయె, – ననివిన్న సుందరి పొగిలెమిగులఁ
దనదు పాచిక పాఱని తంతెఱింగి ॥

దారదుర్బోధచేఁ దాను ఘోరమైన
‘హుకుము’ నిచ్చి పశ్చాత్తాప మొందుచున్న
వేమపతి, సహృదయుఁడు వివేకి, గాన
దారుణము జరుగమికి డెందమున నలరె ॥

పాలకోటను బొలయుపాయకలనఁ
ప్రజలు కరవాలధారల పాలుగాక,
ప్రాణములఁ గాచికొనిరని ప్రభుఁడెఱింగి
మేనకోడలి ప్రతిభకు మెచ్చుకొనియె ॥

అకలుషాత్ముల కిన్క తృణాగ్నియట్లు
బగ్గుమని మండి తొలుదొల్తఁ, బ్రశమనంబు
నందు వెంటనె, యిది నైజమగుట, వార
లాత్మ నమిత పశ్చాత్తాప మందుచుండ్రు.

ధారుణీపతు లెపు ‘డెత్తువారిచేతి
బిడ్డలు’ – గనుండక, స్వచిత్తవృత్తి యెట్లొ
యట్లుపోవక, తమ మంత్రు లనుభవజ్ఞు
లిచ్చు సలహాలబడి రాజ్యమేలఁదగును ॥

సమ్యగవిచారితాత్మాపచారమునకు
లజ్జవడి, వేమనృపతి, కళంకమెడలు
మార్గమెట్లని యోచించి మంత్రితోడ
నపకృతి సహింప బాలాంబ కంపెఁగమ్మ ॥ ౧౧౧

అంతియేగాక యాతఁడనర్ఘమణుల
తళుకుఁజెక్కడపుంబనితనము గలుగు
పసిఁడిబొమ్మిడిక మామెకుఁ బంపెఁ బ్రేమ
మెసఁగఁ గానుకఁగ, సుందరి యెడఁగలంగ ॥ ౧౧౨

మామవంపిన యాబహుమానమునకు
నాత్మఁబొంగక బాల, "యిల్లలుకఁగానె
పండువగునాకొ? – సుందరి గండకైౖ
ఱగుచునుండఁగ నాప్రజ హాయిఁ గనునె? ॥ ౧౧౩

౯

అనుకొనినయట్లు తదభాగ్యమున నెసంగెఁ
బాలకోట ననావృష్టి, పైరులెల్ల
నెండె, రైతుల కడుపులు మండిపోయె
దండిధాన్యాలు బొట్టల నిండుకొనియె ॥ ౧౧౪

తెప్పలు గొంట్లైరి ప్రజలెల్లఁ దిండిలేమిఁ
నెమ్మగూళ్ళయ్యెఁ బసులు గ్రాసమ్ములేమిఁ
మెలఁగుదార్లయ్యెఁ జెఱువులు జలములేమిఁ
ప్రభయడఁగెఁ బాలకోటకు వానలేమి ॥ ౧౧౫

దుర్భరక్షామదినములు దొలఁగిపోయి,
కడుసుభిక్షమ్మై దేశమడర, వరుణ
జపములును, యాగములు శివార్చనలుభక్తిఁ
బొనరిచిరి బాలమాంబయుఁ బోతరెడ్డి ॥ ౧౧౬

సరసముగఁ దిండి గింజలు దొరకునట్లు
బీదలకు గంజికేంద్రాలు వెలయునట్లు
నీటిసౌకర్య మెల్లెడ నెసఁగునట్లు
చేతనైనంత కృషిసల్పెఁ బోతరెడ్డి ॥ ౧౧౭

అట్టియెడ వేమనృపతికి ముట్టఁజెప్పె
కప్పమునకేని పన్నులు గట్టలేని
రైతుజనమును బీడింపరామి నెఱిఁగి
మొదలకుండఁగఁ, గప్పంపు ముదల దూఁకె ॥ ౧౧౮

పాలకోట పరిస్థితుల్ ప్రజల వెతలు
నున్నదున్నట్లు పతికిఁ బోతన్న దెలిపి
'కరుణమన్నింపుఁ డీసారి – కప్పమెల్ల
ముందటేఁ, డిత్తు'నని పంపె నుత్తరంబు ॥ ౧౧౯

దానిఁగని యేమిసేయఁ బాల్వోని ప్రభుఁడు
మత్సరగ్రస్త సుందరి మంత్రకలనఁ
''గట్టవలెఁ గప్పమెప్పటికంటె నధిక
మని విధించి వసూల్ సేయఁ ననిపె బంట్ల ॥ ౧౨౦

ఆమనాగతమరసి బాలాంబ, రాజ
భటుల రావించి, కప్పము బదులు, జనక
మామ కాన్కగ నిడిన మహాహేమమకుట
మొప్పుకొనునట్లు వారిచేఁ ద్రిప్పఁ గొల్పె ॥ ౧౩౧

ఆమెచేఁతకు సుందరి మానసమ్ము
గత్తివాటుకు నెత్తురుచుక్కయును లేక,
వెలవెలంబారె, సతికిఁ గోపమె సుబుద్ధి
గఱపెనని వేమభూపతి కడుఁ జెలంగె ॥ ౧౩౨

౧౩

# వీరాలాపము

(బాలచంద్రుడు — తనతల్లి - ఐతమ్మతో :—)

ఆలంబున, దరివర్గ నిర్దళన వి
ద్యాప్రౌఢి యేపార, దో
ర్లీలా లాస్య విలాసము ల్నెఱపి, పె
ర్చిన్గన్, శత్రురక్తాపగన్.
బాలుం గన్నియ నోలలార్పఁ జనుమన్,
వంశ ప్రథన్నిల్పుదున్,
జాలిం బొందకు మమ్మ! వీరవనితా
సద్ధర్మ మూహింపుమా ॥ ౧

పిసుల మాంసాన్నం గలుగు
బీరము; నేర్పును, నస్త్రవిద్యయున్
నేరని బాలకుండని గ
ణించితి వేమొకొ? వెఱ్ఱితల్లి! బల్
కాఱడవిం దహించు నన
లంబుకణం బదియెంత? నాదుదో
స్సారము ముందరన్ నిలువ
శక్యమె? వైరులు, జీనముంతగన్ ॥ ౨

త్సంధాచాతురి యేర్పడం గ్రతుసహ
స్రంబూని, తా రీచతు
ష్కంధి ప్రావృత ధాత్రియేలిరి యశః
కామాత్ములై కారొకో! ॥ ౫

రారాజుల్ పదునల్వురుం దనువులన్
రక్షించుకోఁజాలిరే?,
స్వారాజ్యంబున కేఁగకే నిలిచిరే?
షట్చక్రవర్తుల్ భువిన్
వారల్ నెక్కొనఁజేయరే? నిజయశో
వల్లుల్ దిగంతంబులన్,
సారాపేత శరీరముల్ దిరములే?
శౌర్యప్రథల్లేనిచోన్ ॥ ౬

ఆజిమదారివీర సము
దార భుజాబలమోర్జి స్వీయవి
భ్రాజితశౌర్య సంపద, న
రాతి చమూతతిఁ గూల్చువాఁడు, ను
త్తేజితరాజయోగమున
దివ్యగతిం గనువాఁడుఁ, బాత్రుఁ, లా
రాజిత మోక్షలక్ష్మిసహరి
రంభణ సౌఖ్యరసానుభూతికిన్ ॥ ౭

రసవద్భాగ్యము లెండమావు, లసపుం
బ్రాయంబు గ్రీసీడ క్రీ
డసమానాంచిత భోగపాళి కరిక
ర్ణాంతాతి చాంచల్య, మీ
యసువుల్ బుద్బుదతుల్యముల్, దలఁప దా
రాపత్యముల్ సంకెలల్;
ప్రసృతఖ్యాతియు, శౌర్యమే నిలుచుఁ గ ౮
ల్పాం బంతమౌ నంతకున్ ॥

సమయం బెప్డు ఘటించునో, యరిభుజా
సంరంభదావాగ్ని నే
శమియింపం దొరకొంటకం, చనయమున్
స్వాంతమ్మునం దెంచుచో
సమరం బబ్బెను మత్పురా సుకృతలే
శస్ఫూర్తి నినాళ్ళకుం,
గమమే! నే వెనుదీయు టెప్డు సరివా
ర్ణవ్యంగ వీరప్రసూ! ॥ ౯

పలనాఁటం గల వీరులం బ్రథముఁడై
భాసిల్లు బ్రహ్మయ్యకుం,
గులశీలాంచిత మైతమాంబికకు సూ
నుండై న నాయట్టిఁడున్

గల నన్నెఁ వెనుదీయఁగాఁ జనునె ?, ప్రా
ణంబంత తీసానె ?, యీ
కలఁతఁ నీడుము, 'పెండ్లికంపు నటువే
ష్యం బాపు, నఁ గోరికెఁ ॥ ౧౦

వెతలం బొందకు మమ్మ! గెల్పుఁగొని, వే
వేగన్ భవత్ప్రీతి, నీ
మతికి న్మోదముఁ గూర్చునమ్మ! స్నుషమా
మాంచాల డిల్లొడ్డ, నా
తత ధైర్యంబును గొల్పుమమ్మ! భగవ
త్పాదాబ్జముల్ నమ్మి, స
మ్మతి నాశీస్సుల నీయవమ్మ! కడుఁ బ్రే
మన్, మ్రొక్కెదం దల్లిరో ॥ ౧౧

(గృహలక్ష్మి — 1952 - జనవరి)

౧౨

# హెచ్చరిక

తూలుతు నవరసము లొలుకఁగఁ
పలుకు, నలంకృతుల మెఱసి బహులలిత శ్రీ
డల నృపుల మదుల దొంగిలఁ
గల ధన్యను, సుకవిమాన్యఁ గవితాకన్యన్ ! ౧

పుయిలోడక భయమందక
నయగారితనంబు వెలయ నానాభాషా
జయితుల సభలను నృత్య
క్రీడలొనరఁ గవిత్వకన్య కీర్తి వహించున్ !! ౨

*యతియుం బ్రాసముఁ గూర్చుమాత్రఁ గవిరో ?
మామాత్రపుం దెల్పి, యీ
క్షితి యం బ్రహ్మల కుండదెందఱొ' - కటా
శ్రీ వేంకటేశోక్తి సూ
నృత; మాతీరు కవీంద్రులే ఋషులనన్,
విజ్ఞాత్త మాదిష్టముల్
చిత్తైనం జగముల్వడంకవాకొ ? దే
వీ ! యాంధ్ర భాషారమా ! ॥ 3

'కవిత్వము సెప్పగల్డు'—మని
గ్రామము గ్రామము చుట్టిచుట్టి హే
యపు నరపాళి కాసువుల
టంచరగానికి నాలుపద్దెముల్
చెప తెప చెప్పు నాకుకవి
దేబెలకెల్లను జెంపపెట్టెదన్
నృపతిసభావిహార సుక
వీంద్ర కృతీందిర సారెసారెకున్ ॥

చీకొట్టాల్ గురియించు లోభులిడఁగాఁ,
జేకొన్న సాల్వాల్నగల్,
గోఁకల్ షోకులజోకులోఁ ; బతకముల్
గోరాడ్విభూషాంకముల్
గోకొమ్మంచు మహేశ్వరుల్ పిలిచి యీఁ
గూర్మిం సమార్జించు వ
స్త్రాకల్పంబు లనల్పముల్ పతక ము
ఖ్యాంబుల్ సుకీర్త్యంకముల్ ॥

భిక్షించి తెచ్చికొనియొసఁగు
రక్షణాపున్ రేకు లాభరణములు సాల్వాల్ !
కుక్షింభరతం దెలిపెడు
లక్షణములు కవిత కవ్వి లక్షణములొకో ;

కవితాకుమారి! నీ వవివేకి వైతివే?
నుడివినంతన వచ్చి నోటఁబడక?
చెఱుదమా! నీవింత చేలవం బయితివే?
పిలచినంతన వచ్చి పేరి నెక్కఁ,
ఔంకేరమా! నీవు బీరంబు పిడితే?
యడిగినంత వచ్చి యడుగు ద్రొక్క
నాలువా! నీ వేమి చాకింటి మడంత వే?
తలఁచినంతన వచ్చి తలనునిక్కఁ!
బొట్టవోడిచిన ముక్క లేనట్టి వార
లెల్ల భాషా మహాదేవి నేడిపింపఁ
గవులమని లేచి యరుదెంచు కాలమందుఁ!
గోవిదులు కవులాట సిగ్గులకుఁ జేటు ॥ 2

"అభినవ వ్యాసాంక మందవచ్చునుగాక
బహుపురాణాఖ్యాన పటిమ యేడ?
వ్యాఖ్యాతృ చక్రవర్త్యాఖ్య గల్గును గాక
శబ్దభావజ్ఞాన శక్తి యేడ?
కవిసార్వభౌమ విఖ్యాతి యబ్బునుగాక
డిండిమభట్టు నోడించు టేడ?
గండపెండారంబు గాల వెల్గునుగాక
నవ్యప్రబంధ సంధాన మేడ

"పట్టి డబ్బుడక్కి వేసాల వశ్యమగునె ?
పాండితియుఁ" గవితయు నెట్టివానికేని,
రెంటినుం గల్గి నృప, బుధా ఖండలులకు
వేడ్కఁ బుట్టించు కవులకే, బిరుదులొప్పు ॥ ౭

"కవిసార్వభౌముఁడన్ ఖ్యాతి నాఁటికి నేఁటి
కగు నొకనికె రెండవతని కగునె ?
శబ్దశాసన సద్యశంబు నాఁటికి నేఁటి
కగు నొకనికె రెండవతని కగునె ?
కవితాపితామహ ఖ్యాతి నాఁటికి నేఁటి
కగు నొకనికె రెండవతని కగునె ?
సహజపాండిత్య ప్రశస్తి నాఁటికి నేఁటి
కగు నొకనికె రెండవతని కగునె ?
"నేఁటి కవులేడ ? యేడ యానాఁటి కవులు !
వాసుదేవాఖ్య యున్నంతఁ బొంద్రకుండు
యదుకులుండౌనె ? కవులార !! యదరిపడక
'నక్కవాఁతల కత' మదిం దలఁపు డయ్య ! ॥ ౮

"పరిణయసభల, గర్భాధాన తల్పంబు
కడ, నామకరణంబు నడుచుచోట,
రాజకీయోద్యోగి రాకపోకలు సాగు
పట్టున, నరసిక ప్రజలయొద్ద,

మేజువాణీ చెంత, రాజకీరము పొంతc,
జట్టి నిర్మాణంపు సభ్యసరస,
సంగీత హరికథా సందర్భములయందుc,
గాటిలోc బీనుcగు కాష్ఠము నెపౌ,
“నెల్లయిక్కల నీవయై యేడ్తువేల ?
పద్దెములతోడ నీపని పాడుగాను !
కవితకుం బెద్ద లిడినట్టి గౌరవంబు
గంగపాల్సేసి తక్కటా ! కవికుమార ! ౧౦

“గొప్ప యుద్యోగముల్ గోరిన సమయమున
దధికారి జనముల యండ కంపి,
కాసువీసముల కేcకారిన యదనున
సిరి గల్గు లుబ్ధుల చెంత కంపి,
‘సర్టిఫికేట్సు’ గాంచcగ నెంచి నప్పుడు
పలు దొడ్డవారల పజ్జ కంపి
యింటి బత్తెము గడియింపc బూనినతఱి
నరసిక పశువుల సరస కంపి
“కనcబడిన యెల్లమనుజుల కడకు నంపి
సారమును జంపి కవిత బజారిc జేసి
రకట, యీనాcటి కవు, లిcక నామె పెక్కు
వ్యాధులకుc బాలువడి కుందు టబ్బురంబె ? ౧౧

'చకచకఁ జెప్పుదు'—మని యే
కాకిబికి యల్లికలొ నాల్గు గూర్చిన సరియా ?
సుకమీయనిచో మది, కవి
"తుకడా" పద్దెములె వానితోఁ బనియేమీ ? ॥ ౧౨

రాణించ, విలసిల్ల, రంజిల్ల, భాసిల్ల,
దీపించఁ, గ్రాలంగఁ, దేజరిల్ల,
నెలమి, నెమ్మిని, గూర్మి, నింపుఁ బెంపెసలారఁ,
జెన్నలరారఁగ వన్నెమీఱ,
ముదమొదఁ బొదలంగ, మోదంబు గూడంగఁ,
బొరయంగ, వఱలంగ, సరగ, మించఁ,
సౌమము, ననారత, మతులితము, సతంబు,
నమర, సిరులుగుల్కఁ, ననువుగ, వెసఁ,
జెలువుగ, నలువుగఁ, జెలఁగఁగఁ, దలఁపఁగఁ,
బొందుగ, నెనయంగఁ, బొలుపు, పేర్మి,
వరయఁ, దగ, రహిం, దనరఁగ, నల, కనంగ,
వొగి, మఱియు, నెంచఁ, జూడఁగ, నొప్ప, నోసర,
లలిని, మానుగ, వెలయఁగ, నలరఁ బరఁగ;
నవకవుల కాఁతగఱ్ఱ లీ నాఁటికృతుల ॥ ౧౩

బెండు ముక్కల శబ్దరాజియు,
బెండబంక సమాసముల్,
మొండి సంధులు, మిట్ట పల్లపు
మోటుదారుల శయ్యలున్,

గుండె గొల్చెడు పాకముల్, చవి-
గూల్చునట్టి రసంబులున్
మెండు; కొండటి నేటి కైతల,
మెత్తురే యవి పండితుల్ ? ౧౮

ప్రాసముల్ యతులు వ్యర్థపదాళి పద్యంబు
లను జోజ హేతువు లను నొకండు,
చచ్చు పురాణముల్ పాలించి ఖండకా
వ్యముల రచింపుడంచను నొకండు,
పాత లక్షణముల వంక జూడక గ్రామ్య
మును నాదరింపుడం చనునొకండు,
మునుపటి కృతుల నేడనో దొరలిన దోస
మును గని యదిలక్ష్య మనునొకండు,

ఇట్టి విపరీతభావంబు లెన్నియేని
యుబుకుచున్నవి నవ పండితోత్తములకు
మనములం, దిక నెట్లు వాఙ్మయము బ్రదుకు ?
తెలుగువారల యశమెట్లు తేజరిల్లు ? ౧౯

వృత్తియా ? కడుపునింపికొను దేవిరిగొట్టు
కవులనోళ్లను బడి నవయువృత్తి,
రీతియా ? భావాతిరిక్తార్థ విజ్ఞాన
భరితమౌ శుష్క కావ్యములరీతి,

గుణమా? విలక్షణోల్బణ పండితంమన్య
దుర్గ్రామ్యవాద బంధురగుణంబు,
లసదలంకారంబులా? యపార్థాది సాం
కర్యశోభలె, యలంకారవిధులు
అలవడియెఁ గావ్యరమకు నేఁడబ్బురముగఁ
బూర్వదార్ఢ్యము నశియించెఁ, బోయె బలము,
బక్కచిక్కిన, దిఁక, మీరు ప్రాజ్ఞులార!
లెండు లెండు, చికిత్స సేయుండు, వేగ॥ ౧౬

('త్రిలిఙ్గ'—రజతోత్సవ సంచిక : 1940)

# కృతజ్ఞత

చిత్తూరు మండల — శాస్త్రీయోపాధ్యాయ పండిత పరిషత్ సంఘ పంచమ వార్షికోత్సవము—21-12-52 ఆదివారము నాడు తిరుపతి పురమున జరుపఁబడినది. సాయంతనము 2 గంటలకు ఉన్నత పాఠశాలా భవనమున — శ్రీ యం. మొగ్రంరెడ్డి, బి.ఏ., బి.ఇడి.—గారి అగ్రాసనాధిపత్యముక్రింద శ్రీ వేంకటేశ్వరోన్నత పాఠశాలాభవనమున సభ సమావేశమయినది. చిత్తూరు మండల పండిత ప్రముఖులును; మదరాసు, కడప—మున్నగు ప్రాంతములలోని విద్యార్థులును, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలాంధ్రాధ్యాపకులు పెక్కండ్రును, న్యాయవాదులు, ఉన్నతోద్యోగులు మున్నగు పౌరవరేణ్యులనేకులును సభ నలంకరించిరి. ఆ సభాముఖమున "విద్వత్కవి భూషణ" బిరుదముతోడను, దుశ్శాలువులతోడను సత్కరించిన సందర్భముం బురస్కరించికొని కృతజ్ఞతా సూచకముగ ఈక్రింది పద్యములు రచించితిని.

దేవా వేంకటశైలరాట్సదన, నీదివ్యప్రభావోన్నతుల్
భావింపన్ గమలాసనాభవదిశాపాలాదులే చాల రిం
తే, వర్ణింపఁగ నింక నాతరమె ? త్వన్నిర్వ్యాజ కారుణ్య దృ
క్ప్రావీణ్యంబున నింతవాఁడనయితిన్, స్వప్రజ్ఞఁ గాదింతయున్॥

నీ నెలకొన్న క్షేత్రమున నీదగు సన్నిధిఁ బండితుల్ కవుల్
జ్ఞానధనుల్ హితాగ్రణులు సత్కరణం బరిషత్తుఁగూర్చి, స
న్మానము పేర నాపయి ఋణంబిటు మోపిరి, దీనిఁ దీర్పఁగా
నౌనె ? యిఁకెన్ని పుట్టువులకైనను నాబరువీవె పూనుమా ॥

[illegible]నధికుఁడంచు నెవఁడను ?, 'తాఁడిఁదన్ను
[illegible]నిఁ దలఁదన్నువాఁడు లోకానఁగలుగ

సన్మానించు బుధుల్పెక్కురున్నచోట
సత్కృతులుగాంచు టే నదృష్టంబగాదె ॥

## 'గురుపదోపదా' పద్య రత్నహారము

క. గురునకు గురుపత్నికి పితా, వరునకు 'నెహ్రూ చరిత్ర' వరసుకృతి సుధీ,
పరునకు వేదాంబుధి హిమ, కరునకుఁ గరుణాకరునకుఁ గై మోడ్పులివే !,

క. వేదం బభి వర్ణించుటె; వేదాన్వయ జనితుఁగూర్చి వివరించుట లీ,
సాదృశ్యమెంచు తెలియంగుట, కాదనుఁడీ ! స్వానుభవము గాననికతనన్,

క. నాగురుఁడవని వచింపఁగ, నే గర్వించెదను గాని నీశిష్యుఁడనం,
నాగళోద్భక్తిగఁ బలుకఁగ, యోగింపదు జాతకమ్ము యోగ్యతలేమిన్,

తే. సత్యముగ నీవు పుంరూప శారదాల, లాము వే; సందియము లేదు; లాతు లెట్లు.
వాకొనిన నేమి? నీమ్రుదు వాఙ్ముఖమ్ము, జడమతిని నేని జంఘాలశాస్త్రి నేయు.,

సీ. 'కౌశిక' నామ విఖ్యాత విమర్శక వ్యాసమ్ము లెవని ధీవైభవమ్ము,
'కుందమాలా' ద్యనేకోద్గ్రంథ నిర్మాణ మెవ్వాని కవితకు హేతుభూతి
'మామ్నాయ నిలయ' గ్రంథాగార నిర్మితి కెవ్వాని పరహిత మేదుగడయు
తెలుఁగుపాలాన నల్వాలఁకుల నెవ్వాని పలుకుఁబోకడ పెద్దపంట పండు
మటేయు, 'గోదూరు' పౌరు లెగురుని శిష్టమార్గదర్శకతేజ యశోనుసిత్తు
లగుచు.
అట్టి మన్గురు వరుని నేనభినుతింతు నెంతొ వేదము వేంకటకృష్ణ శర్మ.

సీ. చదువు చెప్పుటె గాక సద్గుణమ్ముల నేర్పి జీవితమ్మును మార్పు చేసె నెవఁడు.
కవితయందే గాక కడు రాజకీయ చైతన్యమ్ము గల్పించి తనరె నెవఁడు
యైహికమ్ములె గాక యాముష్మికమ్మును మూలమ్ము బోధింపఁ జాలె
నెవఁడు
శిష్యుఁడే యని గాక చెలికాని వలెఁ జూచి బహువిధమ్ముల సాయపడె
నెవండు

పసితనమ్మున నాహార వాదములను శాంతముగఁ జెప్పి సవరింపఁ జాలెనెవఁడు
వానినుతియింతు వేదాన్వయవారాశీందు మద్గురు వేంకట కృష్ణశర్మ.

సీ. 'రాయలసీమ'యే రతనాల గడ్డని పూనిపల్కఁగ హేతువైనవాఁడు
'రాయలసీమ'యే ప్రాముఖ్య కవులకాస్థానమంచని పల్కఁదగినవాఁడు
'రాయలసీమ'యే మాయమర్మములు లేనిదంచని చూపనైనవాఁడు.
'రాయలసీమ'యే గ్రాంథిక భాషల కాలవాలమ్మనఁ జాలువాఁడు
మఱియు 'రాయలసీమ'యే మాటలందఁ గాక చేఁతలఁ జూపునాఁ గ్రాలువాఁడు

సకల సద్గుణ సంపత్ప్రశస్తివాఁడు కృష్ణశర్మయె మువ్మాటికిని నిజమ్ము!

సీ. సాహితీ విద్యార్థిసమితి కెవ్వనియిల్లు తఱిలేని విశ్వవిద్యాలయమ్ము
రాజకీయమ్ము నేర్వంగ నెవ్వనియిల్లు ప్రథిత శాసన సభా ప్రాంగణమ్ము
తీఱని సందియాల్ దీర్ప నెవ్వనియిల్లు కొండాడఁ దగినట్టి గురుకులమ్ము
పటుతరాస్తిక్య భావమున కెవ్వనియిల్లు భూయిష్ఠమైన దేవాయతనము
తెలుఁగుఁదనమునఁ బసమించు వెలుఁగుఁగాంచి పంటపొలమట్టులుండు నెవ్వాని యిల్లు

కొలుతు నాయింటి వాని మద్గురువరేణ్యు నెపుడు వేదము వేంకటకృష్ణశర్మ.

సీ. నిశిత విమర్శనా నిపుణతఁ జాటించి మంచి 'హైరోడ్డు' వేయించినావు
శతక వాఙ్మయములో నతిశయమ్ములు చూపి 'పంజాబు మెయి'లట్లు పర్వినావు
నేరైనకావేరి 'వాటరు ఫాల్సు' మాదిరి వాగ్విమర్శనల్ జరిపినావు
కవితలో బహుముఖకావ్యముల్ రచియించి 'లైటుహౌసు'ను దలదాఁటినావు

ప్రబలనిష్ణాతసద్భావశబలతను మేటి 'మెట్టూరు డా'మయి మెలఁగినావు
నీమతమ్ము విశాలాంధ్రభూమి నమ్ము వినుతియింతుగాదు మువ్మాటికిని నిజమ్ము ||

ఆ|| ఒకటి రెండుగావె యోయమ్మ! నీవెన్ని పరమహితులు కృతులు వ్రాసినావు
నీదుకలముగీటు నిద్రాణజగతికి స్ఫూర్తి వేటు పైన కత్తిపోటు ||

క. కార్వేటి నగర రాణ్నృప పర్వేందు సభాంగణమునఁ బండితపదవీ
పూర్వ యశోమండితులగు సర్వజ్ఞుల మిమ్ము వినుతి సలుపంగల నే ||

క. గురుని నుతించుట ధర్మము గురు నినుతించినను బొగడికోలనిరు సభాం
తర మెంచు ద్వంద్వవిజయమె గురుమూర్తీ! యార్యసూక్తిఁ గాని
యాడుటనుజా.

(వైద్యవిద్వాన్) పండిత—నారు నాగనార్య.

## పండితాభివందన నవరత్నములు

శ్రీరమణీ మనోహరునిఁ జిన్మయు, వేంకటనాథు భక్తిపెం
పారు మనంబునన్ నిలిపి ప్రార్థనసేయుచునుండు బుద్ధవి
స్తారునిఁ బండితోత్తముని సత్కవి వేంకట కృష్ణశర్మ వి
స్ఫార యశోవిలాసు నుతి సల్పెద వందన పూర్వకంబుగన్ ||

అల్లకార్వేటి నగరంబునందు నాఁడు క్ష్మాతిలేశుల సంస్థాన సభలలోన
బహుపురాణ విమర్శనా ఫణితి మిగుల వ్యాప్తిఁ గాంచెను వేదమువారికీర్తి ||

అట్టి వేదము వంశమునందుఁ బుట్టి రామయార్యుండు కీర్తి విభ్రాజితుండు
రామదివ్య కథా విధానామృతాప్తిఁ బ్రజలసంతోషపఱచు పౌరాణికుండు||
ఆంధ్ర వాల్మీకి స్వయముగా నాలకించి. 'రామచంద్రుఁడే తన చరిత్రను .
బుధులకు
జెప్పుచున్నాఁ'—డనుచు మెచ్చిచెప్పెనంట । రామయ సుధీంద్రుఁడెట్టి
పౌరాణికుండో ? ||

అట్టి పౌరాణిక కుమారు లరయ నల్వు రబ్జభవు నాల్గు మోముల యట్లు, లందుఁ
గర్త ఘనుఁడైన వేంకట కృష్ణశర్మ పెద్దకొమరుండు కవులను దిద్దుచుండు.
జననము వేదవంశమున, సఖ్యము పండితులైనవారితో,
వినయము సంస్కృతాంధ్రముల నచ్చపుఁ గైత, విశుద్ధనిత్యజీ

గానము, సుబోధకత్వము, శుభప్రదమైన తలంపు, ధర్మని
సహనము శీలసంపదయు వాసిలె, నీయెడ సత్యవీశ్వరా ||

హితులని బంధు జాలమని యెయ్యెడ విందులఁ గూర్చుచుందువే
మతిప్రియమూను నీవు, రసికాగ్రణివంచున పండితుల్ ప్రశ
స్తుతులను నింపుగా వినఁగఁ, జొక్కుదు నీదు కవిత్వతత్త్వమం
చితముగ వించుచుందువు, విశిష్టమతీ కవిలోకశేఖరా ||

'కుందమాల' తెలుంగుసేఁతకు మెచ్చి నోరూరంగఁ బొగడె వేటూరిశాస్త్రి,
'ఆంధ్రభాషిని' గుణ మత్యద్భుతంబని వచియించె శ్రీప్రసన్నస్వామి,
'స్వప్నభంగము' తెన్గు నొప్పిదమును గూర్చి పలికిరి తేఁటగా బులుసువారు,
'తేనె సోనలు'—ఆలోని తీపి నాస్వాదించెఁ గొల్లఁగా మల్లంపల్లి శాస్త్రి,
ఎన్ని రచనలో ?- మెచ్చి కొండాడిరో బుధాగ్రణులు—లెక్కింప వలనియగునె ?
సతత సారస్వతాన్వేషణ సలుపు నీదు మహితగుణశక్తి లోకసన్మాన్యమయ్య ! ||

కలముఁగదల్చి, సత్యమువికస్వర భావమరంద ధారలం
జిలికి జగద్రహస్యములఁ జెప్పిలు 'తేనె సోన' పల్కులం
బలికిన పండితోత్తమ ! యపారకళానుభవా ! నమోస్తు ! మీ
సలలిత కావ్యకల్పనము సంస్తుతి చేయఁగఁ జాలువాఁడనే ? ||

(విద్వాన్) కనమంగాము శివరామయ్య

## గురుస్తుతి

సర్వసాహిత్యమిడు రసపద్యములను సేకరించి, రసంబులపాక మెఱిఁగి
తెలుఁగు ప్రజలకుఁ బంచిన దిట్టవీవు తరమె నిన్ను నుతింప ? మద్గురువరేణ్య ||
విశ్వభారతి సాహిత్య వీథులందు మిమ్ముఁగొనియాడి తనచేతి మీఁదు గాఁగ
నాట్యమాడించుచున్నదయ్యా ! యదృష్ట మన్న మీయదె కృష్ణశర్మ ! నమస్తు ||

మనుమ సెలయేటిలోని తుంపెడుకుఁదనము, మలయమారుతమందలి చలువఁదనముఁ
తమ్మి మొగ్గల సోగియించు కమ్మఁదనముఁ గానఁ బడుచుండు మీరస కవితలందు ||

సర్వమానవ సంస్కృతి సరణి దెలిపి, మానవాంత స్స్థితంబైన మమతలెత్తిఁగి,
కర్మమయమైన దైవిక మర్మమరసి కవితలల్లఁగఁ బ్రార్థింతుఁ గవివతంస
సృష్టి సర్వోదయమ్మున దృష్టినిలిపి సర్వ భువనంబులన్గడు నిర్వహించు
శాంతి సమతా గరిష్ఠుఁడౌ చక్రిమిమ్ము నతులవాత్సల్యమునఁ బ్రోవ నుతులొనర్తు||

వై. సి. వేంకటరెడ్డి.

## గురువందనము

శ్రీరమాహృది సోగియించు చెలువుకాని భక్త కవికోటి యాపద లాపువాని
శ్లోకమ్మునకు దేవరైనవానిఁ బ్రవిమలాత్మఁ దలంతు నాపాలివాని ||
భాస్కర సంకాశ గాత్రుఁ డెవ్వాని కరుణ వెలుఁగుఁ గళలుష్ణముంగల్గి వెలయుచుందు
సింతరాత్మమునఁ భువి బంతివోలె నిలిచె నెవ్వానియూరు వానిం దలంతు ||

ఆంధ్ర గీర్వాణ భాషామహాబ్ధితరణి, వేదసులకలశాంబుధివిధుఁడు, భ్రాతృ
వసుఁడు, పోషకుఁడుఁజ, నిజగురుఁడు, సుగుణధనుఁడు, వేంకటకృష్ణశర్మ నుదలంతు ||

కిలుముల వలంతి మిన్నయియుఁ బలుకువెలఁది తడవు తడఁబడ కొండొరుల్ దగుల మాని
సేయు విద్దెయుఁగూర్చి సుస్మేరవదనలగుచు నటియింత్రు నీయింట సార్యవర్య||
అవధరింపుము తోలుతె నీయమల సాధు చరిత మెంకయింత వర్ణింతు, సజ్జనగణ
వస్తినముగూర్చి తెనవుట బహుళపాప హారియగుటయ గాక శ్రేయముఁనొసంగు||

సప్తర్షి భూతాత్ముల నెలకొను పరమాత్మ సుగుణముల్ వర్ణించి పొగడునేని,
నలువ నల్మోముల వెలువరించి ఋషులచేఁ బ్రత్యహంబును పాడఁబడునేని.
శక్రాదిదేవతాసమితియుఁ గనలేని సుజనవంద్యనిజాత్మఁ జూపునేని,
మువురమూర్తుల సృష్టిముఖ కార్యములకు సమ్ముఖులఁ గావింపఁగ మొనయునేని,

శ్రుతివేదము నిజవంశమై వెలుంగ మాన్యకౌశిక గోత్రమ్ము ధన్యతఁగన
సూరిలోకం బఖండసంస్తుతులొసగ్వఁ బుట్టె నరసింహభట్టను బుధవరుండు.||

వేదరహస్యముల్ వివరింప బ్రాహ్మణుఁ డీతఁడే బ్రహ్మయం చెంచుచుండ,
ద్రైవభాషాభిజ్ఞతం జాటుచోఁ గవుల్ పుంభావ వాణినాఁ బొగడుచుండఁ,
త్యాగియై స్వర్ణంబు దానమీ యాచకు లపర రాధేయుఁడం చాడుచుండ,
సంపన్నవిభూతులు సమకూరి నెల్లరు హరిహరుఁ డీతఁడే యనుచునుండ,
విలసు గార్వేటినగరభూమీశు కరుణ నమల చామీకర విభూషణాంబరములు
మాన్యములునొంది సూరిసన్మానితుఁడయి చెలఁగు గుణరాశి శ్రీనరసింహభట్టు||

పుత్త్రుఁ గులవృద్ధికరుఁడై సన్నై సద్గుణసమితికిఁ బలువిద్దెలలో
దిట్టయయి వెలయు రామణంభట్టను కృతపుణ్యుఁ డాద్యమహితుఁ డతనికిన్ ||

ఆరామణభట్టు సుబ్బాంబయందుఁ గాంచె సరసగుణుల దిగంత విశ్రాంతయశుల
సమితితేజుల నతులవిద్యాధనికుల కొమరులేవురఁ బాండవసముల బుధుల
యజ్ఞయాగాదు లొనరించి యఖిల సురల భూసురులను సదా తృప్తిఁ జేసె నగ్ని
ముఖమునను భూరిదక్షిణమూలమునను బ్రథమసుతుఁడగు నరసింహభట్టు మిపుల||

వేదవేదాంగవేదియై వెలసి శిష్యతతికి వేదరహస్యముల్ ధర్మశాస్త్ర
పద్ధతులు బోధఁజేసెఁ బ్రహ్మనిభుఁడు రెండవసుతుండు సుబ్బయ పండితుండు||

సూరిజన సంస్తవార్హుఁడు సుగుణఘనుఁడు బ్రాహ్మణాధిక్యతం బూని బ్రాహ్మణులకు
సాంఘికవివాదములఁ దీర్చు చతురమతిని అసముఁ, డాశేషభట్టు మూఁడవ సుతుండు||

సకల విద్యానవద్యుఁడు సౌమ్యశీలుఁ డార్యజనతావిధేయుండు నమలయశుఁడు
జ్ఞానరాశియుఁ దమితతేజోనిధానుఁడయిన వేంకయభట్టు నాల్గవసుతుండు॥

ప్రభుకార్య తత్పరత్వమున నిస్స్వార్థుఁడై మన్ననలందిన మహితుఁడెవఁడు
సకలపురాణార్థచయ బోధనములచే సభల మెప్పించిన జాణ యెవఁడు
అద్దమరేయైన నరుదెంచు నతిథులఁ బూజించి మించిన పుణ్యుఁడెవఁడు
నాస్తియన్ పదమింత నాల్కకు రానీక దానంబుఁ జేసిన ధన్యుఁడెవఁడు
అట్టి మాన్యుండు సర్వవిద్యాధికుండు, పేరుగలవాఁడు నెఱవాత విజ్ఞతముఁడు
న్యాయపక్షవర్తి యనుకీర్తి నందెనెవఁడు ఆతఁడైదవకొడుకు రామయ్యతండ్రి॥

కలిమిలేములు నిత్యములుగావనుచుఁజూచు సుఖదుఃఖముల సరిచూచె నెవఁడు.
కడు శత్రుఁడేయైనఁ గష్టంబటన్నచోఁ గనికరంబునఁ గాంచి కాచె నెవఁడు
లేమిడియందైన లేశంబు సత్యమ్ముఁ దప్పక నడచిన ధన్యుఁడెవఁడు.
ఐశ్వర్యమునఁ దూఁగి యేడువేళల నేనిఁ బరమాత్మపై భక్తిఁ బాయఁడెవఁడు
ఆతఁ డాడంబరహితుఁ డమలగుణుఁడు రామయార్యుఁడు దశరథరామసాటి
అతఁడు పెండ్లాడె సుగుణగణావలంబ సుబ్బవరసాంబ సన్నుతశుభకదంబ॥

ఏ తన్వి యౌవన మిందిరా మందిరమై చిఱునవ్వుపూల్ పూచుచుండు
ఏనాతి పతిభక్తి కెపుడనసూయాది మునిపత్ను లెల్లను మోముచాంతు
ఏ గామ యతిథి సత్కారంబు నన్నపూర్ణాదేవి యశముఁ దిరస్కరించు,
నేకాంత హృదయంబు మాకాంతు పదభక్తి ననయంబు వీడక హత్తియుండు
అట్టి గుణధన్య సుబ్బవర్సాంబ ప్రీతి రామయార్యునిఁ జేపట్టి రామసతిని
బోలు సాధ్వీమతల్లి యా పుణ్యచరిత కొడుకులన్ వేదసముల నల్గురను గాంచె॥

వారిలో జ్యేష్ఠుఁడు వరిష్ఠభావయుతుఁడు వేదవంశపయోరాశి విమలవిధుఁడు
కౌశికసగోత్రవరుఁడు సత్కవినుతుండు అతఁడు వేంకటకృష్ణశర్మాఖ్య
బుధుఁడు॥

వేదశాస్త్రార్థవిదుఁడయి వెలయు రాఘవార్యుఁడు, ద్వితీయుఁడు నరసయాఖ్య
ఘనుఁడు
మూఁడవాఁతఁడు; నాల్గవపుత్రుఁడేను చంద్రశేఖరుఁడను సాధుజనహితుండ॥

అందు నా పెదయన్న కామాక్షిసాధ్వీపతిని విద్యల గ్రహియించుమతి భజించు
శిష్యులందే నొకండనై చెలఁగు కతన నాదువిద్దెలు మిగుల ధన్యతను గాంచె॥

సంశయములెప్పు డడిగిన జాగులేక వినువుగనకింత, విద్యార్థివితతి కోర్కె
తోడ బోధించు సురగురుతుల్యుఁ డెవ్వఁ డతనిమద్గురుఁ బ్రణుతింతు నతులభక్తి॥

ఎవనిమది నవ్యనవనీతమే యనఁదగు నెవనిపలుకులు నవసుధావృష్టిఁగురియు
నెవని చేష్టలు విద్యార్థిహితకరములు నతని మద్గురుఁ బ్రణుతింతు నతులభక్తి॥

బాల్యమదికాదు, లౌకిక పదవిరాదు నాఁటి మదిలేదు కార్వేటినగరి నపుడె
నిలిపెఁ జిరకీర్తి నామ్నాయనిలయ మెవ్వఁ డతని మద్గురుఁ బ్రణుతింతు నతుల
భక్తి॥

ఛాత్ర వాత్సల్య! మతిసురాచార్యతుల్య! ప్రవిమలగుణాగ్రగణ్య! సత్కవివరేణ్య
కోవిదాంబుజమిత్ర! సద్గుణపవిత్ర! అందికొను మివె సాష్టాంగ వందనములు॥

భావనాబలయుతుని పుంభావభారతిని, కవిత్వవిలోల భ్రాతృపదము, గురుని
పావనచరిత్రు దేశసేవాప్రధాను నెంతు వేదము వేంకట కృష్ణశర్మ॥

(విద్వాన్) వేదము చంద్రశేఖరయ్య.

# తేనె సోనలు

## కొన్ని పత్రికల — అభిప్రాయములు

శ్రీ శర్మగారు భావోద్వేగి. వృత్తములందేమి, గేయములందేమి గూడ ఈ భావోద్వేగము ప్రస్ఫుట మగుచుండును. కవి రాయలసీమవాడు. అందుచే ఆ సీమను దలంచికొని నప్పుడు పొంగిపోయి రచించిన పద్యములు సానబెట్టిన జాతిరత్నములు. — నిసర్గమైన భాష — అనర్గళమైన ధారలో గుబాళించు కవిత వీరిది. కవిత్వము, సరసమై సహృదయానంద కరమై యున్నది.

—కృష్ణా పత్రిక (14-2-1953)

ఈ కవి కౌంజబులు "రాయలసీమ రాళ్లసీమ" అను పొల్లుమాటను గీటుబుచ్చి "రతనాలసీమ" యను గొనబుమాటను దేటపఱచినవారు. వీరి కవితామధుకోశము తేనెసోనల గురియించుటలో నబ్బురమేమున్నది?— "ప్రతి పద్యరసోదయ" మ్మను నుడికి వీరి "తేనె సోనలు" సాటిలేని రాచబాట. కవి — ధీరో మనీషీ జ్ఞః ప్రాజ్ఞః సంఖ్యావాన్ ॥ — అన్నాఁ డమరసింహుడు. ఈ లక్షణము లీమహాకవియం దెంత చక్కగ అమరియున్నవో వీరి యొక్క మారీ మధుకోశమాద్యంతము చవిచూచిన వారెఱుఁగఁగలరు. సర్వతోముఖ పాండిత్యమునకు "తేనె సోనలు" — చక్కనికోశము. వేంకట కృష్ణశర్మగారు సార్వకాలీన సార్వజనీన కవులనుటకు వారిచ్చునవే తార్కాణములు

—కిన్నెర (ఫిబ్రవరి 1953)

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారు సుప్రసిద్ధ పండితులు. కవివతంసులు. బహుగ్రంథకర్తలు. సంస్కృతాంధ్రములందు వైదుష్యము నేగాక, చక్కగా రచనలు సాగించు నేర్పు నెన్నడో అలవఱచుకొనిన దిట్టలు. ఆంగ్లములోగూడ వీరికి మంచి ప్రవేశము కలదు. వీరు ఆంధ్రానువాదము లొనర్చుటలో సమర్థులని యిదివఱకు పేరుగడించియున్నారు. ఈ తేనె సోనల ప్రకటనమున నవ్యకవులలో ఎన్నఁదగినవారని ప్రతిష్ఠ గడించుకొన్నారు.

—త్రిలిఙ్గ (2-3-1953)

"తేనెసోనలు" — అన్న గ్రంథనామం సార్థకంగావుంది. ఈ ఖండకావ్య సంపుటంలో జాతీయ భావస్ఫోరకాలుగా ఉన్న గేయ, పద్యరచనలు చాలావున్నయ్.

—ఆంధ్ర పత్రిక (22-3-1953)